# జల్లుకొనిని ప్రతిసారీ ఈ టాల్కం పౌడరు

# మీ చర్మానికి రెట్టింపు రక్షణ సమకూరుస్తుంది




కుటికురా టాల్కం పౌడరు మూలంగా మీకు చేకూరే లాభం యిదే, మీ చర్మానికి ఇది రక్షణ కల్పించిన విధంగా, మరే పౌడరూ కలిగించదు. దీనికి కారణం కుటికురాలో తగు మాత్రం ఔషధాలు కలియడమే. వళ్లుపేయడం, దురదపొక్కులూ మీ చర్మానికి హానికరం. కుటికురా వళ్లుపేయడం ఆపుచేసి, మీ చర్మపు చికాకును శాంతింపచేస్తుంది.

వాసనపుట్టించే చెమటను పీల్చి, మిమ్మల్ని రోజంతా పూవులా సువాసనగా వుంచుతుంది. పట్టులా మెత్తనైన, శాటినులా మృదువైన కుటికురాలో చేర్చిన ఒక ప్రత్యేకమైన సువాసన మీకెంతో ఉత్తేజాన్ని కలిగిస్తుంది.

కుటికురా పసిపాపను కూడా సౌఖ్యంగా వుంచుతుంది. పసిపాపలేత చర్మానికి కుటికురా రక్షణ కల్పించి, దానిని మెత్తగా, మృదువుగా వుంచుతుంది.

ఒక కుటికురా డబ్బాను ఇవాళే కొనండి — ఈ పౌడరుకు 110 సంవత్సరాల సాంప్రదాయముంది.



స్నానం చేసాక, హెచ్చు సేపు తాజాగా వుండేటందుకు, కుటికురా బాగా జల్లుకొవండి.

పసిపాపకు కట్టే గుడ్డను మార్చినప్పుడల్లా కుటికురా జల్లితే, పొక్కులురావడం గాని, చర్మం ఒరపడంగాని జరుగదు.

గడ్డం గీసుకొన్నాక కలిగే మంటను తగ్గించుకొని, కుటికురాతో చల్లగా వుండండి.

# కుటికురా

కుటికురా ఆయింట్‌మెంట్, పుండ్లను మాన్పుతుంది. వంటిపూతనూ, చర్మదురదనూ మాన్పి, చర్మారోగ్యాన్ని కాపాడుతుంది.



కుటుంబానికి అంతటికీ పనికివచ్చే బహుళ విధోపయోగకరమైన టాల్కం పౌడరు

NATIONAL C 10163

# ఉత్తరాలు

## సరాగమాల

10—8—62 తేదీ వారపత్రికలో శ్రీరాం (పింగళపూడి) గారు తరువాత రిలీజ్ అయిన 'ఇద్దరు మిత్రులు' సినిమాలోని 'హలో హలో అమ్మాయి' అనే పాట మ్యూజిక్ ముందుగా రిలీజ్ అయిన 'భార్యాభర్తలు' సినిమాలో వినిపించుటకు కారణమేమిటని ప్రశ్నించారు. ఆ పాట 'ముస్తఫా' అనే ఇంగ్లీషు రికార్డు ననుసరించింది. కనుక 'భార్యాభర్తలు' సినిమా రిలీజ్ అయ్యేసరికి 'ఇద్దరు మిత్రులు' సినిమా రికార్డింగ్ జరుగకపోయినప్పటికీ ఆ పాట మ్యూజిక్ 'భార్యాభర్తలు' సినిమాలో వినగలుగుటలో ఆశ్చర్యము లేదు.

ఇంటి లక్ష్మీనరసింహం (బి.ఎ. ఫైనల్) (కాకినాడ)

* * *

భార్యాభర్తలు, ఇద్దరు మిత్రులు—ల్లో 'ముస్తాఫా' అన్న 'పాట' కు కాపీపాటల విషయం అదే సందర్భంలో—హిందీ 'కపీ' పాటల విషయం మరికొంత వ్రాయాలనిపించింది:

మిమ్మల్నందర్నీ అమితంగా ఆకర్షించిన 'అయ్యయ్యా సూకూ సూకూ' అన్న జింగ్లీ పాట 'నీనా అండ్ ఫ్రెడిక్' పాడిన 'సూకూ సూకూ' (నెంబర్ : డి. బి. 4632 కొలంబియా లేబిల్) కు 'కాపీ.'

'లహరోంసే లెహర్' (చబిలీ) అనే పాట 'డీన్ మార్టిన్' పాడిన 'ఒక్‌హిజ్ లిటిల్ మేన్డీన్' అనే దాని 'ట్రూకాపీ.'

'ఆజారే ..... ఆ .... జా .....' (నజ్రాద్)—పాట 'డేన్ మార్టిన్' పాడిన 'ఓలారే .... ఓడి ....' అన్న దానికి డూప్లికేటు.

'చందా, చాంద్‌సీమే జబ్‌చమ్కే' (ముజ్రిమ్)—పాటకు 'గ్రీన్‌డోర్' అనే పాటవరుస ఆధారం. ఇంకా ఎన్నో ఉన్నయ్. కాని సమయానికి జ్ఞప్తికి రావడంలేదు. పై వాటిలో 'తెలుగు తర్జుమా' లెన్ని వెలువడ్డాయో మరి తెలియదు. ఇంగ్లీషునుండి 'హిందీ'కి—'హిందీ'ని చూసి తెలుగుకి 'సంగీత సాహిత్యంలో' అక్షరాలా నిజమవుతుంది. అందుకే మన తెలుగువారంటే అందర్కీ (ఇదే విషయం కాదనుకోండి !) అంత చులకన, లోకువాను. మన ప్రాంతాన్ని 'ఆంధ్రా ప్రదేశ్' అని మిగిలిన భారతావని పిలుస్తున్నదంటే—మరిటువంటి విషయాలే లెక్కకొస్తుంటయ్.

అందేన్ (రాజమండ్రి)

* * *

"కొమ్ములు తిరిగిన మగవారు మా కొంగు తగిలితే పోలేరు" అన్న రికార్డు "కొండవీటి దొంగ"లో లేదు.

"కొండవీటి దొంగ" చిత్రంలో "వింత మనుషులు మగవారు కోతలెన్నో కోస్తారు" అన్న సాహిత్యముతో ఉంది. భీమవరపురావు (బొబ్బిలి) గారు (20—7—62) పొరపాటున రెండు చిత్రాలలో ఒకే సాహిత్యము, ఒకే వరుస అనుకొనుచున్నారు. వరుసలోకూడ రెండు రికార్డులకు తేడా ఉన్నది. ఒక్కసారి "కొండవీటి దొంగ" చిత్రంలో రికార్డు "భట్టి విక్రమార్కలో" రికార్డు విని సాహిత్యము, వరుస గమనించండి. మీ సందేహము తీరుతుంది.

తులసీబాయి ( వింజమూరు )

* * *

శ్రీ బాపుగారి "రేఖ' అనే విడీవిడనిచిక్కు, ఈ వారంతో శ్రీ వీరాజీగారి "విడీవిడనిచిక్కుల"తో సహా విడిపోయినందుకు చాలా సంతోషంగావుంది.

అనంతరావ్, శర్మ అండ్ శ్యామల (డి. బి. కె. రైల్వేప్రాజక్టు)

## చదువుబ్రావు

నాకు కళ్లజోడు ఉన్నది. ఎప్పుడయినా పుస్తకం చదువుతూ అలాగే కళ్లజోడు పెట్టుకుని నిద్రపోతాను. అలాగే చదువుబ్రావుగారు కూడా ఏదయినా చదువుతూ నిద్రపోయి ఉంటారు.

కుమారి మణి (నెల్లూరు)

## చిత్రకారుడు బాపు

ఉ. అక్కట వల్కు నిక్కమును 'బాపు' గ 'రంగ' గ 'శేషు' 'రేఖ' గా
అక్కజ మందునట్లు బహు చక్కని చిత్రము లేసి అందరిన్
చక్కలిగింతలెట్టు నిను శక్యమె వర్ణన సేయగా నిం
నెక్కుడలేని ఖ్యాతి నిటు తెచ్చుకొనందగ నీకు మిత్రమా !

యు. శ్రీనివాసరావు ( సెవన్ స్టార్స్ సిండికేట్ )

* * *

'ఆంధ్రుల అభిమాన చిత్రకారులు శ్రీబాపు' గారిగురించి వ్రాసిన వ్యాసం చదివి నేనెంతో ఆనందించాను. ఈ వ్యాసంవల్ల నేను 15రూ పందెం గెలువగలిగాను. మాకెన్నో రోజులుగావున్న సందేహం (బాపు, రేఖ ఒక్కరేనా) అన్నది తీరినది. కనువిందు కలిగించు "బాపు"గారి బొమ్మలు ఆయన ఏపేరుతో వేసినా గుర్తుపట్టవచ్చు.

అల్లూరి అరుణ (సూర్యాపేట)

* * *

శ్రీ బాపుగారి ఫోటో, "సైడ్‌ఫేజ్ " వేయడం కొంచెం అసంతృప్తి కల్గించింది."

గోవాడ జనార్దనరావు ( న్యూఢిల్లీ )

* * *

ఎల్లాగూ పరిచయంచేశారుకదా ఆయన మూర్తిని కనులారా కాంచుదామంటే, ఒల్లాంటి ఫోటో వేశారు! బహుశ యింకా అజ్ఞాతంగా వుందామనే కాబోలు వారి వుద్దేశం! గుట్టంతా బయటపడింతర్వాత, యింకా, ఆకాస్త మొహమూ దాచుకోడం దేనికండీ? వీలుచూసుకుని వారి అనుమతితో కాస్త పెద్దఫోటో ప్రచురించండి మన పత్రికద్వారా నా ప్రణామా లందజేయండి.

కుసుమ వివేకానంద్ ( రాజమండ్రి )

* * *

మీ వారపత్రికలో చిత్రకారుడు బాపు ఫోటోవేసి— 'ఆఫీసులో పనిచేస్తున్నపుడు' అని వ్రాశారు. ఆయనకి ఆఫీసులో కూర్చుని తనపేరు రాసుకోడమేపనిలాగు కనబడుతోంది.

ఎస్. ఎల్. నారాయణమూర్తి (మద్రాసు)

* * *

ఆంధ్రుల అభిమాన చిత్రకారుడు 'బాపు' (లక్ష్మీనారాయణ) గారిని పరిచయము చేసినందులకు నా అభివందనములు. 'రేఖ, శేష,' రంగ వేసిన బొమ్మలు బాపుగారివేనని తెలిసి చాలాసంతోషించినాను. ఈ సంగతి ప్రజలకు తెలియకుండా బాపుగారు ఎంతగుప్తముగా ఉంచిరి !

అల్లిన సుచరిత (పాలకొండ)

* * *

బాపుగారి ముఖచిత్రం వేసిన బాగుండేది. మారుపేర్లు పెట్టుకొని మమ్మల్ని చాలా మోసం చేశారు. అందుకు పాఠకులు కోరేది బాపుగారితో ఇంటర్వ్యూ. రేఖ, శేష, రంగి, అంటే బాపుగారి శిష్యులనుకొన్నాం. బాపుగారు పోస్టుద్వారా చిత్రలేఖనం నేర్పుతారా? ఇన్నాళ్లకైనా పరిచయంచేసినందుకు సంతోషం.

విజయలక్ష్మి (వరంగల్)

## కార్టూన్లు

ఇటీవల ఒక సంచికలో పత్రికలో మీరు ప్రచురించిన ఒక కార్టూన్‌లో ఒక కోడి "మైక్" దగ్గరకి వచ్చి కూయుటం చూపించారు. అది అసంభవమేమో ?

టి. ఈశ్వరచంద్ర విద్యాసాగరు ( శీతాఫల్‌మండి )

* * *

జయదేవ్‌గారు "జమీందారు కారు డ్రైవరు ఊళ్లో లేడని" వేసిన కార్టూను అంత అర్థవంతమైనదిగా లేదని తెలుపుటకు చింతిస్తున్నాను. ఒకవేళ జమీందారు పల్లెటూరివాడైతే తప్పక డ్రైవింగు రావలసిందే. ఒకవేళ డ్రైవింగు రాకున్నా ఆవిధంగా జరుగుట అసంభవమేమోననిపిస్తుంది.

పి. ముక్త (సనత్‌నగర్)

## చిత్రవ్యక్తులు

10—8—62 ఆంధ్రసచిత్రవారపత్రికలో నాలభిమాన వర్తమాన సుశిక్షిత నటకుడు శ్రీ ధూళిపాళను చిత్రవ్యక్తులతో ఆంధ్రలోకానికి పరిచయం చేసిన శ్రీ సుకుమార్ గార్కి నా ధన్యవాదాలు.

ఐ. నరసింహామూర్తి (విశాఖపట్నం)

## విమర్శలు

వీరంరెడ్డి మూరిబాబుగారు (3—8—62) పత్రికలో వ్రాసిన ఉత్తరానికి సమాధానంగా గాడ్యుయేటు కోర్సులో మొదటి సంవత్సరాన్ని థర్డ్ ఇయర్ అంటారని వ్రాసారు. కాని ఆ పద్ధతి ఇప్పుడు లేదు. మునుపు ఇంటర్మీడియట్ రెండు సంవత్సరాలున్నప్పుడు డిగ్రీలో మొదటిసంవత్సరాన్ని థర్డ్ ఇయర్ అనేవారు. కాని ఇప్పుడు పి.యు.సి. ఒక ఏడాది డిగ్రీ మూడుసంవత్సరాలు. డిగ్రీలో మొదటి సంవత్సరం ఫస్ట్ ఇయర్‌గానే వ్యవహరింపబడుతున్నది. ఇది గమనింప ప్రార్థన.

వేణుగోపాల్ (అనంతపురం) ★

## కథ కాని కథల రచయితలకు

### విజ్ఞప్తి

రచయితలీశీర్షికకు కేవలం 'హాస్య సంఘటనలు'నే పంపుతున్నారు. నిత్యజీవితంలో చిత్రవిచిత్రాలైన సంఘటనలెన్నో తటస్థిస్తూ ఉంటాయి. వాటిని గురించి కూడా వ్రాస్తే బాగుంటుందని రచయితలకు మనవి చేస్తున్నాము.

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
*
శుక్రవారం 24—8—62
సంపుటము : 54 సంచిక : 51
శుభకృత్ సం|| శ్రావణ బహుళ దశమి
స్థాపితము :
1908
*
ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్
*
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా : రూ. 13.00 ఇతర దేశాలు : ఓడమీద (Sea Mail) రు. 20.00. (విమానంద్వారా (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా: 135.00.)

విడిప్రతి : 25 న. పై
*
ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి, మద్రాసు-1




'మహామంత్రి తిమ్మరుసులో' విజయలక్ష్మి.

## మనలోమాట

ఈ వారంతో ఎఫ్. బి. ఐ. కథలు ముగిశాయి. ఈ శీర్షిక అనుకున్న దానికంటే ఎక్కువగా పాఠకుల అభిమానాన్ని చూరగొన్నట్లు మాకు వచ్చే ఉత్తరాలనుబట్టి తెలుసుకున్నాము!

మద్రాసులోకూడ 'ప్రయివేట్ డిటెక్టివ్‌లు' ఉన్నారంటే మేము నమ్మలేదుకాని ఇటీవలే ఒక 'అపరాధపరిశోధకుడు' మమ్మల్ని కలిశాడు! త్వరలో ఆయన ఆంధ్ర సచిత్ర వార పత్రిక పాఠకులకు పరిచయం కాగలడని నమ్ముతున్నాము.

* * *

'వెండిమబ్బు'నవల ఈసంచికతో అయిపోయింది. ఈ సీరియల్ ఇటీవల ప్రచురణ అయిన వాటిలో అత్యుత్తమ మయినదని చాలామంది వ్రాశారు.

* * *

పైవారం ఆంధ్ర సచిత్రవార పత్రిక అట్టమీద ఎవరి బొమ్మ ఉంటుందో వేరే చెప్పనక్కరలేదు! సంచికలోపలమాత్రం నవ్వుపుట్టించే శీర్షికలు ఎక్కువగా వేద్దామని మా ఆశ (యం.)

## లోకంపోకడ



"అడా ఈడా చేసినట్టు నేనూ పాలల్లో నీళ్ళు కలుపుతున్నా ననేగా మీ అనుమానం ? ఆ అనుమానం పెట్టుకోకండి. ఆవు కాసిన్ని నీళ్ళ ఎక్కువగా తాగింది. అందుకని పాలు కాస్త పల్చగా ఉన్నాయంతే !!"

## విషయానుక్రమణిక


ఎంతఘోరం!
సంజీవరెడ్డి కొత్తమంత్రుల్ని
వేసుకోనే వేసుకోడట!!


చిత్తూరు ఉప ఎన్నిక
లో కాంగ్రెసు అభ్యర్థి
విజయావకా
శాలు
శిస్తుపెంపకం బిల్లు


వెనకటి చాంబర్లియన్
హిట్లర్ని మంచిచేసుకోవా
లని ప్రయత్నించాడు---


దాని ఫలితం తర్వాత
తెలిసింది..!


ఇప్పుడు చైనాను మచ్చికచేసుకోవా
లని నెహ్రూ ప్రయత్నిస్తున్నారు


కాని ఫలితం...

# హరివంశము

## సాందీపని పర్వం- 70

వాచాలునకు తాను మాతలి వలన వినిన వృత్తాంతము నెట్లు చెప్పవలయునో తెలియలేదు. మాతలి చెప్పగా వినినప్పు డా వృత్తాంతమేమో బాగుగానున్నది. కావ్యమువలె నున్నది. అంతయు తాను చూచుచున్నట్టు లున్నది. కాని ఇప్పుడు దానిని తాను తిరిగి చెప్పవలయునన్నచో, ఆ మాతలి చెప్పినట్లు చెప్పుట సాధ్యమగునా! మాతలికావిద్య తెలియునుగనుక వాడు అందరి రహస్యములను వివరించిచెప్పెను. తనకు ఆ వివరములు సరిగా అర్థముకాలేదు. అదియొక కథవలె నుండుటచే తనకు అప్పుడు అది ఆనందమును కల్గించెను. మరి దాని నిప్పుడు తానెట్లు చెప్పవలయును. తాను చెప్పినచో అది రసరహితమైన కథవలెనుండును. నీరసముగానుండును. వాసుదేవు డే దత్తిలునో పిలిపించి యడిగినబాగుండును. వారి కావిద్య తెలియును. వారు బాగుగా చెప్పగలరు.

"వాసుదేవ!"

"వాచాలా!"

"నీవు ఏ దత్తిలునో పిలిచి ఆ వృత్తాంతమును చెప్పుమనరాదా! వారు బాగుగా చెప్పగలరు."

"నీవేల చెప్పరాదు!"

"నాకు వినుట తెలిసినట్లు చెప్పుట చేతనగుట లేదు"

"నీకు తెలిసినట్టులు చెప్పుము".

వాచాలుడు ఉస్సురనెను. "సరియె చెప్పెదను వినుము" అనెను. పౌండ్రకుడు నవ్వెను. మౌనియై యొక్క ఆస్తరణముపై కూర్చుండెను. వాచాలుడు చెప్పుట మొదలిడెను. మాతలి రథము దారుకుని రథమువెంటనంటిపోయెను. దారుకుడొక సమస్థలమున తనరథము వాపెను. మాతలి రథము తనసమీపమునకు వచ్చుదాక నాగెను. ఆగి వాడు రాగా వానితో ఇట్టులనెను:

"మాతలి! నీకు ఒక అద్భుతమును చూపెదనురా! దానిని చూచి పోవుదువుగాని!"

"స్వామి! మిమ్ములను, మీ రథమును, అందరి యున్నవారలను తీసుకొనిపోవుటకు నేను వచ్చినాను. మీరు నాతో రావలయును. కానిచో మారాజు నన్ను శిక్షించును...."

పౌండ్రకుడు గల్లున నవ్వెను. వాచాలు డాతని వంక చూచెను. తనచెప్పుట బాగుగా లేదువలె నున్నది. వాసుదేవుడు నవ్వుచున్నాడు. వాచాలుడు ముఖమును చిన్నబుచ్చుకొనెను. ఇట్టులనెను.

"వాసుదేవ! నేను అందుకే చెప్పనన్నాను. నాకు చెప్పుట తెలియదన్నాను. నీవు నన్ను నవ్వుచున్నావు."

"వాచాలా! అవును. నేను నవ్వుచున్నాను. ఎందుకు నవ్వుచున్నాను. నీ చెప్పుటనుగూర్చి కాదు. మాతలి దారుకునితో నినిన మాటలనుగూర్చి. వాడు వానితో ఏమనినాడు!...."

"నీవు రాకపోయినచో మారాజు శిక్షించు ననినాడు."

"అవును! వానిని ఎట్టులును శిక్షించితివి."

"వాడు ఆపనిని చేయలేదని నీవు వానిని శిక్షించ లేదు...."

"నీకును కొంచెము తెలివియున్నది. తరువాత నేమి జరిగినది?"

"ఏమిజరిగినది. నేను ఆ జరిగినదానిని చూచినా నన్నట్లు అడుగుచున్నావు. నేను చూడలేదు. మాతలిచెప్పగా విన్నాను. వినినదానిని చెప్పుచున్నాను."

"అవును—ఆ వినినదానినే చెప్పమనుచున్నాను."

"చెప్పుచున్నాను. వాసుదేవ!"

మరల వాచాలు డా వృత్తాంతము చెప్పెను. దారుకుడు మాతలివంక విచిత్రముగా చూచెను. చూచి నవ్వెను. నవ్వి ఇట్టులనెను. "ఓరి! నిన్ను ఏల శిక్షించునురా! నీ చేయవలయుపని నీవు చేసితివి. నీకు మేము అందలేదు. నీ వేమిచేయుదువు! మేము అందలేదని మీరాజుతో చెప్పెదవు. ఆయన కొంచెము వినుగుకొనును. మరియు మాతలి! మీరాజు ధర్మముచేయుటలేదురా! ధర్మముచేయుచో నిట్టులేల ఆలోచించును. మా తల్లిని, వామాక్షిని చూడుము. ఆయనను, సుదామస్వామిని చూడుము. మరి మీరాజున కీబుద్ధి యేల పుట్టవలయును. ఆమెను....." అని వాచాలుడు చెప్పుచు నాగిపోయెను. అతని ముఖము ఎఱ్ఱబడి గండరింపుగా నయ్యెను. పౌండ్రకుడది చూడలేదు. చెప్పుచు నాగిపోయి నాడేమా అని—"వాచాలా! ఆగిపోయితివేమి! తరువాత....."

"తరువాత....."

"ఆ దారుకుడు నిన్నువర్ణించెను."

అని పౌండ్రకుడు మరల గల్లున నవ్వెను. వాచాలునివంక చూచెను. నవ్వుచు చూచెను.

"వాచాలా! నేను నిన్ను ఒకక్షణంటివానిని చేయవలయుననుకొంటిని. అది సాగలేదు. అదిసరే! ఆ దారుకు డేమన్నాడు....."

"నేను కోతివలె నున్నానని మాతలితో అన్నాడు. నేను అట్టులున్నానా!"

"వానికి నీవు అట్టులు కన్పించియుందువు" అని పౌండ్రకుడు మరల నవ్వెను.

"నీకును అట్టులే కన్పించుచున్నానువలె నున్నాను" అని వాచాలుడుముఖముగంటుపెట్టుకొనెను.

"తరువాత చెప్పుము."

"నేను చెప్పను....."

"మరి నేను వినవలయును."

అంతలో వాకిటిలో ఎవ్వరో గల్లున నవ్వినట్లయినది. వాచాలుడును, పౌండ్రకుడును, తలలెత్తిచూచిరి. సుదక్షిణయు, వృద్ధకంచుకియు వచ్చటనుండిరి. పౌండ్రకుడు ప్రశ్నార్థకముగా వారిని తిలకించెను. సుదక్షిణ లోనికివచ్చినది. కంచుకి ద్వారమువద్ద నిలబడియుండెను.

"మహారాజ! మాతలిరాలేదు. ఆవిషయము చెప్పుదమని వచ్చితిని."

"నీవేల రావలయును."

"రావలయుననిపించినది. వచ్చితిని. మరి రాకపోయితి ననుకొనుడు. వాచాలుని ఈ కథ చెప్పుట నెట్లువిందును."

అని ఆమె వాచాలుని చూచెను. అతడు ప్రేటు పడినవానివలె కూర్చుండియుండెను. మాతలి

—62 పేజీ చూడండి

# హేల నేత్రాలు

## పి. గణపతి శాస్త్రి



### జరిగిన కథ

నిచుళానగరంలో వేశ్యమాత శృంగారమంజరి ప్రసిద్ధురాలు. హేమసుందరి ఆమె రెండవకుమార్తె. ఒకనాటి అర్ధరాత్రివేళ హేమసుందరిని రహస్యంగా కలుసుకొనడానికి వచ్చిన ఆమె ప్రియుడు రంగనాయకుడు, భవంతి కావలి వారిని గాయపరచి తప్పించుకుని వెళ్ళిపోతాడు. శృంగారమంజరి భవంతిలో గజదొంగ జొరబడ్డాడని మరునాడు నగరంలో పొక్కిపోతుంది. పట్టణ తలవరి శృంగారమంజరిని, ఆమె కుమార్తెలను కలుసుకుని సంగతి సందర్భాలు విచారిస్తాడు. తిరుమలరెడ్డి ప్రోద్బలంతో మాణిక్యవల్లి హేమసుందరీ రంగనాయకుల ప్రేమకలాపం గూర్చి తెలుసుకుంటుంది.

### 5

మాణిక్యవల్లి చల్లనిమాటలతో చెల్లెలిక్షేదో కొంత భరవసా ఇచ్చింది. మరి భయంలేదని వోదార్చింది. కాని తన పడకగదిలో ప్రవేశించిన తరువాత పట్టరాని ఉల్లాసంతో ఉప్పొంగిపోయింది. తలవనితలంపుగా ఆమె కిప్పు డొక చక్కని దారి దొరికింది. హేమసుందరికోసం తిరుమలరెడ్డి లోలోపల ఎంతయినా ఉబలాటపడుతున్నారు గాని, ఈ గొడవ చెవినిపడినతరువాత అతని కామె యెడల విపరీతమయిన విరక్తి కలిగితీరుతుంది. అంతేకాదు. తనమీద మొలకెత్తిన అనుమానం పూర్తిగా తుడిచిపెట్టుకుపోతుంది. క్రమక్రమంగా తమ ఇద్దరి అనుబంధము బాగా బలపడుతుంది. తన జీవితం నిష్కంటకమై భాగ్యభోగాలతో కలకలలాడుతుంది. ఆపైన ఇంతటి పరమ రహస్యం మిక్కిలి చాకచక్యంతో బయటపెట్టినందు కతని దగ్గర నుంచి ఒక సరికొత్త బహుమానం కూడా సంపాదించుకోవచ్చును.

ఇక హేమసుందరీ రంగనాయకుల సంగతి. తిరుమలరెడ్డి ద్వారా తలవరి కీమాట తెలిసితీరుతుంది. అందువల్ల రంగనాయకుని కెప్పటికయినా కారాగార ప్రవేశం కలిగి తీరుతుంది. మరికొంత కాలానికి హేమసుందరి అతన్ని మాటే మరచిపోతుంది. మరిచిపోక మరి చెయ్యగలిగిన దేది లేదు. ఏది ఏమయినా రంగనాయకు డిక తమ భవంతి పైనా కన్నెత్తి చూడడు. ఆ ఉపేక్షతో ప్రాణం విసిగిన హేమసుందరి ఎవరో ఇంకొక ఐశ్వర్యశాలి ప్రాపకం సంపాదించుకొని వేరొకచోటికి వెళ్ళిపోతుంది. శృంగారమంజరి లోలోపలి సంకల్పం కూడా అదే! .... లేకపోతే కుమిలి కుమిలి దుఃఖంతో కట్ట కట్టుకుని కళ్ళు మూసుకుని కావేరిలో దూకుతుంది. ఎన్నెన్ని విధాల ఆలోచించినా ఆమె తన దారి విడిచి దూరదూరంగా తొలగిపోయినట్టే కనిపించింది. అందుచేత ఆ రహస్యం తిరుమలరెడ్డి చెవిలో చెప్పి తీరవలసిందే అని మాణిక్యవల్లి నిశ్చయించుకొన్నది.

కాని ఆ సంగతి తల్లితో చెప్పనని హేమసుందరి చేతిలో చెయ్యివేసి ఒట్టు పెట్టుకొన్నది. అయితే తిరుమలరెడ్డితో చెప్పనని మాత్రం మాట ఇవ్వ లేదు. మాణిక్యవల్లి అది బాగా లోతుగా ఆలో చించి చేసిన పనే! తల్లితో చెప్పినందువల్ల లేని పోని గొడవ తప్ప తన ఒడిలో ఒరిగేదేదీ లేదు. కనక ఆమె ఆ రహస్యం గుంభనగా లోలోపలే దాచి వేసుకుని తిరుమలరెడ్డి రాకకోసం ప్రతి క్షణము నిశ్చలదృష్టితో నిరీక్షించింది.

కాని అతడా తరవాత రెండు, మూడు రోజుల దాకా శృంగారమంజరి సౌధంవైపే కన్నెత్తి చూడ లేదు. అతని ఉపేక్ష కేమి కారణమో! మాణిక్య వల్లి ఎంతగా తల కొట్టుకున్నా బోధపడలేదు. చిట్ట చివరకి, ఆ మరునాడు తమ భవంతి కొకమారు విచ్చేయవలసినదని దాసి నాంచారమ్మ ద్వారా కబురు పంపించింది. ఆమె తిరిగి వచ్చి అలాగే వస్తున్నా మన్నారని చెవిలో చెప్పింది. మాణిక్యవల్లి చక్కని చుట్టుచెంగావి శ్రీరంగం పట్టుచీర ధరించి ఏడు వారాలనగలు పెట్టుకుని మాటిమాటికీ మేడ కిటికీ కానుకొని నిలుచున్నది. ఎట్టకేల కర్ధరాత్రి వేళ రెడ్డి ఆ భవంతి గుమ్మంలో అడుగుపెట్టాడు.

అప్పటి కందరు ఆదమరచి నిద్రిస్తున్నారు. ఆమె స్వయంగా తానై వీధి తలుపు తెరిచి సిగలో తురుముకొన్న తెలిమల్లెపూల సువాసనల గుబాళింపు లతో చిరునవ్వుల రువ్వులతో అతనిని లోలోపలి కాహ్వానించింది. తన పడకగదిలో వెండి గొలుసుల తూగుటుయ్యాలమీద కూర్చోబెట్టి, వెమలి కన్నుల పసిడివీవనతో బడలిక పోగొట్టింది. సర సనే కూర్చుని, ఏదో సరస ప్రసంగం ప్రారం భించి కమ్మని కర్పూర తాంబూలం చిలక లందిం చింది.

రెడ్డి యాథాలాభంగా అవి అందుకొని నోట పెట్టుకుంటున్నాడు గాని బాగా ముభావంగా ఉన్నాడు. ఏకాగ్రదృష్టితో ఏదో ఆలోచిస్తున్నాడు. ఎంతో ఆప్యాయంగా మాటిమాటికి పలకరించినా మరి సమాధానం మాటే తలపెట్టలేదు. మాణిక్య వల్లి కతని మనోవేదన హేతువేమి అవగాహన కాలేదు. ప్రాణం విసిగి 'ఇదేమిటిలాగ ఉన్నా రీవేళ!' అని చెక్కిలిమీద పెదవి ఆన్చి అడిగింది. రెడ్డి కొంచెం విసుగుదలతో 'సరేగాని ఆ దొంగజాడ ఏమయినా దొరికిందా ?' అని సూటిగా ప్రశ్నిం చాడు. మాణిక్యవల్లి! క్షణకాలం నిర్భ్రాంతపడి ఉప్పొంగుతున్న ఉత్సాహంతో సమాధానం చెప్పింది :

'దీని కింత గుంజాటన ఎందుకు ? వాడి గుట్టంతా బయటపడిపోయింది.'

'ఆ! ఆ! నిజంగానే

'నిజమే! లేకపోతే ఇలాంటి వ్యవహారంలో మీతో వేళాకోళా లాడతా ననుకొన్నారా ?'

అటుపిమ్మట మాణిక్యవల్లి అతని చెవిలో సంగ్ర హంగా రంగనాయకుని సంగతి చెప్పింది. ఆ వృత్తాం తము విని వినగానే తిరుమలరెడ్డి బాగా దిగాలుపడి పోయాడు. అయిదారు నిమిషాలదాకా అతని నోట మాటే వెలువడలేదు! క్రోధావేశంతో కళ్ళు రెండు జేవురించాయి.

'ఈ వ్యవహారం ఇలాగ ఎన్నాళ్ళనించి సాగు తూంది ?'

'నా కంతబాగా తెలియదుగాని ఇంచుమించుగా అయిదారు నెలలనించి అత డెక్కడికి వెళ్ళినా హేమ సుందరిని వెంటాడిస్తున్నాడట!'

'అయితే మరి మీ రెవరికి ఈ సంగతే తెలియ లేదా ?'

'మొట్టమొదట రెండు మూడు రోజుల క్రితమే నే నామాట విన్నాను. ఇది ఇంతటి దవు తుందని మా అమ్మ కలలో కూడా అనుకొని ఉండదు! అయినా యిద్దరి మనస్సులు ఏకమయినప్పు డిక వాళ్ళ నెవరయినా అడ్డుకోగలరా ?

'సరేలేగాని, అతగాడి తండ్రిపే రేమిటి ? మళ్ళీ చెప్పు!'

'వెంకటనాయకుడు.'

'అతడేమి చేస్తున్నాడు ? ఎక్కడ ఉంటున్నాడు?

'మన పడమటి పొలిమేరలో కొబ్బరితోపు లేదూ ? దానిలో ఒక చిన్న పెంకుటింటిలో ఉంటు న్నాడట! కొడుకులతో కలిసి ఏదో చిన్న కొంద్ర దున్నుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడట.'

'మరి వీడి కిదేమిటీ దుర్బుద్ధి ?'

'సరిపోయింది వయస్సు మమ్మరంలో ఉన్నప్పు డీ శషభిష! లెవరికి కావాలి ?'

'అలాగా!' అని తిరుమలరెడ్డి పళ్ళు పటపట కొరికి 'సరే! ఇక వాడి కాయుర్దాయం మూడినట్టే! ముక్కలు ముక్కలుగా నరికించి ఉప్పు పాతర వేయించేస్తాను. తిరుమలరెడ్డి అంటే ఎవరో వాడికింకా తిన్నగా బోధపడలేదు కాబోలు! ఇక ముందు తెలుస్తుందిలే!' అని లోలోపలి దురా గ్రహావేశం నిగ్రహించుకోలేక నల్లనల్లని కోడె త్రాచులా రొజుకున్నాడు. రంగనాయకుని సంగతి విన్నంతలోనే రెడ్డి ఇలాగ మారిపోగలడని మాణిక్యవల్లి చూచాయగానయినా వూహించి ఉండలేదు. అది విన్న పిమ్మట తన బహుమతి సంగతి ప్రస్తావిస్తాడని ఉబలాటపడింది. కాని అత డామాటే తలపెట్టలేదు.

మాణిక్యవల్లి అతని భుజంమీద చెయ్యివేసి 'మీకెందుకీ అనవసర శ్రమ. కాస్త తలవరి చెవిలో వేస్తే ఆపై వ్యవహారమంతా అతడే చూసు కుంటాడు. మనం ఏమి ఎరగనట్టు మాట్లాడక కూరుకోవడమే మంచిది! లేకపోతే నలుగురిలోను అనవసరంగా మన కెందుకీ రభస! ఇంత గొడ వయిన తరువాత అతడిక ఈ ఇంటి దరిమానానికి కూడా రాడు!' అని చల్లచల్లగా తన లోలోపలి పన్నాగం బయటపెట్టింది. ఆ తరవాత ఆ వ్యవ హారం అంతటితో కట్టిపెట్టి సరస ప్రసంగం ప్రారంభించింది. బిగి కౌగిలింతతో బంధించి తిరుమలరెడ్డి కిక ఊపిరే ఆడనీయలేదు. చెక్కిలి ముద్దుపెట్టుకుని నెమ్మదిగా తన బహుమతి సంగతి జ్ఞాపకం చేసింది. కాని రెడ్డి ముఖవైఖరి గమనించి తటాలున తన గాఢాలింగన బంధం సడ లించింది.

రెడ్డి కళ్ళు రెండు ఈదరగాలితో ఎర్ర ఎర్రని చింతనిప్పుల్లా రాజుకొంటున్నాయి. అయినా అత డెంతో ప్రయత్నించి పిడికిలి బిగించి లోలోపలి కోపావేశం నిగ్రహించుకొన్నాడు. మాణిక్యవల్లి అది గ్రహించినంతలోనే చిన్న చిరునవ్వు చిందించి 'చూడు నీ కెలాంటి బహుమానం యిస్తానో! మీ

—53 వ పేజీ చూడండి

## మల్లెమొగ్గ

### కోపల్లె శివరావు

మాట్లాడవు మల్లెమొగ్గ!
మౌనమేల నీకు సిగ్గ!!?......

మదిలోన కొంగ్రొత్త
మమత గొలిపేవు!...
ముగ్ధ మోహనచిత్ర...
ముద్దు లొలికేవు...

నీ నవనీతమృదుల
నిమ్న మానస గాఢ
పరిమళ ద్రవ్యాల
పరవశమ్మొలికి!...

మల్లి నీ మినమినల
తెల్ల నీపున్నమల
ఝల్లుమను భావాల
వెల్లి విరియించి!!...

చిన్న రేకుల మొగ్గ!...
కన్నె సిగ్గులనిగ్గు
లొలికించి లేయెడద
పులకలెత్తించి!!...

పుట్టేవు-పెరిగేవు
పూబోడి సిగలోన
పుట్టి నన్నాళ్ళుగా
పుడమి నుండవుగ!!...

మనసార ఒకమారు
మాటాడి పోవ.........
మాట్లాడవు మల్లెమొగ్గ
మౌనమేల నీకు సిగ్గ?

'బాత్ ఏక్ రాత్ కీ' చిత్రంలో వహీదారహమాన్, దేవానంద్.

శాంతకు దుఃఖం ఆగలేదు—కన్నీళ్ళరూపాన అది బయటకు ప్రవహించింది. ఐనా గంభీరంగా—"అవును. నీ స్థితి మరిచి మాట్లాడుతున్నావు. నీకు అనుపత్రి కట్టించి ఇస్తున్న లక్ష్మీపతిగారి భార్యను నేను సర్వోక సాధారణ డాక్టరుని. నీ శాంత లేదు. ఆమె జన్మ చాలించింది. ఆ శాంతస్వరూపంలో వున్న అశాంతిని నేను! అర్థమైందిగా—వెళ్ళు" అని లోపలకు వెళ్లిపోయింది— శాంత! వేణు మాట్లాడలేదు—బాధగా, బరువుగా అడుగులు వేసుకుంటూ నిష్క్రమించాడు. చివరిలో ఈమాటలు వింటున్న లక్ష్మీపతి, వేణు కంటపడ కూడా తప్పించుకుని, ఆ మాటలు విని ఎంతుకనో బాధపడ్డాడు. ఆ బాధలో అతనికళ్లు చెమ్మగిల్లాయి, బరువుగా నిట్టూర్చాడు. అతను భార్యను దండిస్తాడా? క్షమిస్తాడా? ఏమో! చూడాలి.

లక్ష్మీపతిగా గుమ్మడి, వేణుగా జగ్గయ్య, శాంతగా జమున నటిస్తున్నారు. వీరుకాక, ఈచిత్రంలో రమణారెడ్డి, అల్లు రామలింగయ్య, కుటుంబరావు, ఛలం, రామకోటి, సూర్యకాంతం,



పద్మశ్రీ నారి 'సిరిసంపదలు' చిత్రంలో నాగయ్య.

మాలతి, హేమలత, లక్ష్మీకాంతమ్మ, కొత్తనటి మణిమాల నటిస్తున్నారు. ఇప్పటికి ఈ చిత్రానికి తొమ్మిదిరీళ్ళు నిండాయి.

"స్టూడియోలలో సెట్లు దొరకనప్పుడు ఇల్లా బయట ఇళ్లల్లో షూట్ చెయ్యటం మంచిపద్ధతే గాని, ఇందులోనూ కొన్ని బాధలున్నాయి ఇప్పుడు మాకు ఈ ఇంట్లో నాలుగురీళ్ల పని ఉన్నది. ఈ పద్ధతిలో షూట్‌చెయ్యటం అన్నది—తెలుగు చిత్రాలలో — ఇదే ప్రథమం! ఈ అలవాటు హాలీవుడ్‌లో బాగా వుంది, అప్పుడప్పుడు ఉత్తరాది వారూ చేస్తున్నారు" అన్నారు ఈ చిత్ర దర్శక నిర్మాత తిలక్

ఈ చిత్రానికి మాటలు పినిసెట్టి, పాటలు ఆరుద్రా రాస్తున్నారు సంగీతం పెండ్యాల నాగేశ్వరరావు, కెమెరా. వి. వి. ఆర్. చౌదరి (ఈయన కొత్త ఛాయాగ్రాహకుడు. చాలాకాలం అసిస్టెంటుగా పనిచేసిన వ్యక్తి) కళ: తోట, ఎడిటింగ్: సీహెచ్ వెంకటేశ్వరరావు, స్టిల్సు వి. యల్. కుమార్.



శ్రీ కృష్ణసాయి ఫిలింస్ వారి "మాయామోహిని"లో వారిణీ, ఉదయకుమార్.



'అమరశిల్పి జక్కన్న'లో
నాగేశ్వరరావు

## కళాప్రపూర్ణవారి "ఇరుగుపొరుగు"

ఓ పాడుబడిన ఇల్లు. చిత్రను రాము కాపాడి తీసుకొచ్చాడు.

"నేను నిజంగా ఆయన్ను పెళ్లిచేసుకో దలచుకోలేదు. ఎలాగైనా సరే, రవినుంచి నన్ను కాపాడండి!" అన్నది చిత్ర ఆవేశంగా, విచారంగా.

ఇంతలో రవి దూకుడుగా వచ్చాడు. రవి, చిత్రా ప్రేమించుకుంటున్నారు. తన ప్రియురాలిని తీసుకువెళ్లటానికే రవి వచ్చాడు. వస్తూనే "చిత్రా, వెళ్లిపోదాం రా!" అన్నాడు. "మీరు వెళ్లండి—నేను రాను" అన్నది చిత్ర. ఈమాటకు రవి ఆశ్చర్యపోయాడు—"ఏమిటీ—నువ్వు రావూ!" అన్నాడు. చిత్ర మాట్లాడలేదు. ఇంతలో రాము జోక్యంచేసుకున్నాడు— "అవును — ఆమె నీతో దలచుకోలేదు. నువ్వామెను బలవంతంగా తీసుకొచ్చావు!" ఈ మాటతో రవి మరింత కొయ్యబారాడు — కాస్త ఉద్రేకంకూడా వచ్చింది. "అయితే నువ్వు బలవంతంగా ఉంచదలచావన్నమాట' అన్నాడు.



"కులగోత్రాలు"లో కృష్ణకుమారి, నాగేశ్వరరావు.

"ఔను."

"అందుకేనన్నమాట నన్ను డబ్బు తీసుకు రమ్మనే నెపంతో పంపించావు."

"అవును పంపించాను—ఏంచేస్తావు ?" అన్నాడు రాము కోపంగా.

రవికి బాగా కోపం వచ్చింది. "ఏం చేస్తానో చూస్తావా ?" అన్నాడు మీదకు వస్తూ. వస్తూనే రాము గుండెమీద గుద్దాడు—రాము క్రింద పడిపోయాడు. ఇంతలో చిత్ర "రవీ" అన్నది మందలించే స్వరంలో.

—49 వ పేజీ చూడండి

డా॥ గాలి బాలసుందరరావు

# క్షుద్రాహిత్యము (ఆకలి లేకపోవడము)

అనేక ఆంగికరోగములలో ఆకలి తగ్గిపోతుంది.

ఆకలి లేకపోవడమును వైద్యపరిభాషలో "ఎనోరెగ్జియా" (Anorexia) అంటారు. "ఒరెగ్జిస్" (Orexis) అంటే ఆకలి. "ఏన్" (An) అన్న ఉపసర్గ వ్యతిరేకార్థమును సూచిస్తుంది. ఈ రెండుమాటలు కలిసి "ఎనోరెగ్జియా" అన్న మాట ఏర్పడింది.

ఆకలి మందగించడానికీ, అసలే లేకుండా పోవడానికీ అనేక కారణము లుండవచ్చును. ఆకలి లేకపోవడము కొన్ని రోగములలో ఏర్పడే లక్షణము. అదే ఒకరోగముకాదు. దీర్ఘమైన గేస్ట్రైటిస్ (Chronic Gastritis). జఠరాశయగతమైన కేన్సరు. శరీరములో విషవస్తువులు చేరడము (Taxaemia) — క్రిమి జనితములయిన జ్వరములు — క్షయ మొదలగు రోగస్థితులు—ఆకలిని తగ్గిస్తవి. ఈ స్థితిలో నాలుక మీద దట్టమైన కోటింగ్ ఏర్పడుతుంది. ఆందోళన, విషణ్ణత (Deppression) వంటి మానసికపరిస్థితులలో ఆకలి మందగించుతుంది.

నైరికక్షుద్రాహిత్యము:—మనస్సుకూ, నరములకూ సంబంధించిన కారణములవల్ల ఆకలి నశించిపోతుంది. ఈ పరిస్థితి సాధారణంగా వయస్కులైన స్త్రీ పురుషులలో ఏర్పడుతుంది. పురుషులలోకంటే స్త్రీలలో అధికంగా తటస్థిస్తుంది. ఇది ఏర్పడడానికి తీవ్రమైన మానసికరోగము లేమీ ఏర్పడనవసరంలేదు. ఇది వంశానుక్రమంగా వచ్చేవ్యాధికాదు. జీవితంలో—ముఖ్యంగా ప్రేమలో—ఆశాభంగంవంటి విషాదపరిస్థితులలో మానసికాందోళనకు ఫలితంగా ఈ క్షుద్రాహిత్యము ఏర్పడుతుంది. అతిగా స్థౌల్యము (లావెక్కిపోవడము) ఏర్పడుతుందనే భీతి ఒక్కొక్కప్పుడు ఆకలిని మందగింపచేస్తుంది. ఆకలి వేస్తున్నా, ఆహారాన్ని క్రమంగా బలవంతంగా తగ్గించుకుంటూ వచ్చినందున కొన్నాళ్లకు ఆకలి చచ్చిపోతుంది. దైహిక సౌఖ్యానుభూతి పాపమనీ, తగినంత ఆహారం తీసుకుంటే భౌతిక వాంఛలు పెరిగిపోతవనే భీతి కొన్ని మతభావాలతో మతిచెడ్డవారిలో ఏర్పడి, వారు బలవంతంగా శరీరాన్ని కృశింపజేయడానికై ఆకలిని చంపుకుంటారు. ఇతరులమీద కోపము, బెంగ, కచ్చ, జీవితంమీద విరక్తి ఆకలిని చంపివేస్తవి. తమ కిష్టంలేని ఆహారంతప్ప మరేమీ దొరకనప్పుడు ఆకలి చచ్చిపోతుంది. ఇల్లా కొన్నాళ్లు జరిగినతరవాత ఆహార వాంఛను అంతరింపజేసే పరిస్థితులు మారినా ఆహారవైముఖ్యము నిలిచిపోతుంది. తనలో ఆకలి చచ్చిపోతున్నదనిగాని, ఫలానా కారణంవల్ల ఆ మార్పు ఏర్పడ్డదనిగాని రోగికి తెలియనేతెలియదు. జీర్ణశక్తిని అభివృద్ధిచేసే ఎన్ని ఔషధములు వాడినా ఆకలి మళ్లీ ఏర్పడదు. అటువంటివారికి నిపుణులచేత మానసిక చికిత్సలు చేయించవలసిన అవసరం ఏర్పడవచ్చును.

శరీరవృద్ధినీ, దాని కవసరమైన ఆకలినీ కంట్రోలు చేసేది పిట్యూయిటరీగ్రంథి ముందుభాగములలో తయారయ్యే స్యందనము (Anterior Pituitary Extract) అది లోపించినప్పుడు ఆకలి క్షీణించిపోతుంది. నైరిక క్షుద్రాహిత్యమూ (Anorexia Nervosa) ఆ వ్యాధీ ఒకటే ననుకోరాదు. ఆ వ్యాధిలో కొన్ని వినాళికాగ్రంథుల సారములు (Endocium Extracts) ఆవిధమయిన క్షుద్రాహిత్యమును నివారిస్తవి. కాని, నైరికమైన (నరముల లోపములవల్ల ఏర్పడిన) క్షుద్రాహిత్యములో అవేవీ పనిచేయవు. ఒకే వ్యాధిలక్షణము అనేకవ్యాధులలో ఏర్పడవచ్చును. లక్షణములను పరిశీలించి, ఏ ఏ వ్యాధులలో ఆ లక్షణము ఉంటుందో విమర్శించి, వ్యాధి నిరూపణము చేయడమును "వ్యాధి నిర్ధారణ" (Differential) అంటారు. కేవలం ఒక లక్షణమునుబట్టి పరిమితమైన జ్ఞానంతో చికిత్స ప్రారంభించరాదు. ఒకే లక్షణము అనేక వ్యాధులలోవున్నా, అందులో కొన్ని అతిసామాన్యములుగానూ, కొన్ని అపురూపములుగానూ ఉంటవి. అపురూపములు (Rare) అన్నంతమాత్రాన అవి రానేరావనుకోరాదు. ఈమధ్య అపురూపవ్యాధులే అధికంగా వస్తున్నవి. పిట్యూయిటరీగ్రంథిసారం లోపము చాలా సకృత్తుగా ఏర్పడేది. కాని, అణువిచ్ఛిన్నకాలంలో ఏర్పడే కిరణాలు ఏ ఏ గ్రంథులను నశింపజేస్తవో ఏ ఏ ధాతువులను క్షీణింపజేస్తవో నిర్ణయించడం కష్టం. చాలా కాన్పులుచేసిన స్త్రీలలో ప్రసూతికాలంలో విపరీతమైన రక్తనష్టమువల్ల పిట్యూయిటరీగ్రంథి నశించి బాలింతలలో ఆకలి చచ్చిపోవచ్చును. కాని, ఈవిధమైన క్షుద్రాహిత్యము మానసిక చికిత్సలకు లొంగదు. ఈ స్థితిలో చంకలలోనూ, భగప్రదేశంలోనూ రోమవృద్ధి ఏర్పడదు. ఏర్పడ్డా రాలిపోతవి. ఈడుకుతగ్గ ఆకలీ, శరీరవృద్ధీ ఉండవు. విపరీతమయిన నీరసం ఉంటుంది. త్వరగా వార్ధక్య లక్షణములు ఏర్పడతవి. మానసికకారణములచేత ఏర్పడిన క్షుద్రాహిత్యంలో ఈ లక్షణా లేవీ ఉండవు.

జఠరాశయంలో కేన్సరు ఆరంభమయిన కొత్తలో ఆకలి మందగిస్తుంది. ముఖ్యంగా మాంసాహారంమీద విరక్తి కలుగుతుంది. బలవంతంగా తింటే పొట్ట ఉబ్బి వికారపెట్టి వాంతి అయిపోతుంది. మానసిక కారణములచేత ఏర్పడిన క్షుద్రాహిత్యములో పరిస్థితులనుబట్టీ, పరిసరములనుబట్టీ ఆకలి తక్కువగాఉండడం మారుతుంది. మానసికంగా బాధపడుతున్నప్పుడు, అనేక విషయముల మీద వైముఖ్యం ఏర్పడుతుంది. అందులో ఆహారం ఒకటి. లివరులో జీవకణములన్నీ ఇన్‌ఫ్లేం అయి కామెర్లు ఏర్పడబోతున్నప్పుడు ఆకలి పూర్తిగా నశిస్తుంది. ఈ స్థితిని ఇన్‌ఫెక్టివ్ హిపటైటిస్ అంటారు. హిపాస్ (Hepas) అంటే లివరు. లివరుయొక్క ఇన్‌ఫ్లమేషన్ హిపటైటిస్ (Hepatitis). హఠాత్తుగా పెద్దపెట్టు నజ్వరమూ, కుడిప్రక్కపెముకలక్రింద నొప్పీ, ఆకలి మంత్రం పెట్టినట్లుగా తగ్గిపోవడం, ఆహారవైముఖ్యం ఈ వ్యాధి ఆరంభలక్షణములు.

లక్షణములు (Symptoms): — మానసిక కారణములచేత ఆకలి నశించిన రోగులు అన్నివిషయాల్లోనూ, ఒక అర్థంకాని వైముఖ్యమును ప్రదర్శిస్తారు. బలవంతమ్మీదగాని, స్వల్ప పరిమాణములలోనైనా వారు ఆహారమును తీసుకోరు. అథవా తీసుకున్నా పొట్ట ఉబ్బినట్లై వాంతి చేసుకోవలసివస్తుంది. క్రమంగా ఈ పరిస్థితి నిత్యమైపోయి, ఆహారం తీసుకున్నప్పుడల్లా వాంతి చేసుకోవడం జరుగవచ్చును. తగినంత ఆహారం కడుపులోకి పోనందున, నైరికకారణములచేత (Nervous Causes) జీర్ణకోశంలో తరంగచలనం తగినంతబలంతో జరగనందున, మలబద్ధకము ఏర్పడవచ్చు. శరీరం కృశించిపోవచ్చును. తలనొప్పి ఏర్పడవచ్చును. విరేచనంకావడంకోసమై తీసుకునే ఔషధములు శరీరంలో రసాయనిక వికృతులను తారుమారుచేసి, ఇదమిద్ధమని మనవైద్యులుకూడా నిర్ణయించలేని బాధను కల్పించవచ్చును. ఏ పరీక్షలు చేసినా, వారిలో ఏ లోపమూ కనిపించదు.

కడుపులో ఆకలి లేకపోయినా, ఆహారంమీద రోగికి ఇచ్ఛలేకపోయినా, శరీరకార్యక్రమానికి శక్తి కావాలికదా? ఆ శక్తి చర్మానికి క్రిందవుండే కొవ్వునిలవలు కరిగి (Fat Depots) ఉత్పత్తి అవుతుంది. కొవ్వుపొర అంతరించగానే శరీరంలో ఒంపులూ, సొంపులూ నశించి, బొమికలు పొడుచుకుని వస్తవి.

ప్రారంభదశలో ఈ రోగులు కృశించిపోతున్నా, మంచానపడరు. తాము అతిపూర్వంచేసే దైహిక మానసిక పరిశ్రమ చేస్తూనే ఉంటారు. ఇంత చిక్కినా, తిండి లేకపోయినా ఈ జవసత్వాలు ఎక్కణ్ణుంచి వస్తున్నవని చూచేవారికి ఆశ్చర్యంగా ఉంటుంది. ఈ స్థితిలో భూతవైద్యాలు ప్రారంభమవుతవి. కాని కాలక్రమాన రోగులు కార్యవిముఖులై కదలలేని, నిలవలేని, నడవలేనంత దుర్బల స్థితిలో మంచానపడతారు. రోగి చిన్న వయసులోవున్న స్త్రీ అయితే, ముట్లు ఎండిపోవచ్చును. చికిత్సా ఫలితంగా ఆకలి ఏర్పడినా ఈ ఋతుదోషము కొన్ని మాసాలకుగాని అంతరించదు. ఈ స్థితి వ్యాధి ఆరంభదశలోనే ఏర్పడుతుంది. అందువల్ల

—52 వ పేజీ చూడండి




# కులగోత్రాలు

నిర్మాత
**ఎ.వి.సుబ్బారావు**
దర్శకత్వం
**కె.ప్రత్యగాత్మ**




నవయుగ

NVKR



# సరాగమాల

### వి ఎ కె రంగారావు

నాకు ఎప్పటినుంచో శకుంతలాదుష్యంతుల గాథంటే అదొక విధమైన అభిమానం. బాగా చిన్నతనంలో, అంటే నాకు అప్పుడు ఆరేళ్ల వయస్సుంటుందేమో, మా అత్తగారింటికి వెళ్లి, నాకంటె రెండుమూడేళ్లు పెద్దయిన యిద్దరు వదినెలతో ఆడుకునేవాడిని. వారిలో పెద్దామె అప్పటికి చిత్రకారిణి, పాటల రచయిత్రికూడాను. రెండవ వదిన ఆ పాటలనూ, వేరే పాటలనూ చక్కగా పాడేది. మా ముగ్గురికీ నాటకాలన్నా, సినిమాలన్నా పిచ్చి. ఇంట్లోనే శకుంతలనాటకం వేద్దామని మా సరదా. పెద్దవాళ్లు భోజనాలుచేసి నిద్రపోయే వేళ మా నాటకం ప్రారంభించేవాళ్లం. రంగులూ లేవు, వేరే దుస్తులూ లేవు. ఉన్న దున్నట్టుగానే. మాకు అన్ని సీనులలోకి నచ్చింది దుష్యంతుడు సభామంటపంలో శకుంతలను కాదనటం. పెద్దది కనుక మా పెద్దవదినది దుష్యంతుడి పాత్ర, చిన్న వదిన కాని, నేనుకాని శకుంతల వేసేవాళ్లం. మేము వేసేదంతా ఏమిటే, "ఫో నీ వెవరవో ఏ నెరుగ" అని పెద్ద వదిన తెచ్చిపెట్టుకున్న మగ గొంతుకతో గంభీరంగా అంటే "హా నాథా" అంటూ కెవ్వున కేకపెట్టి నేలమీద ధన్‌మని పడటం. ఆ పడేటప్పుడు తలకు దెబ్బతగలకుండా చెయ్యి అడ్డుపెట్టుకోవటం. అలాగ పదిసార్లు రిహార్సలు వేసి క్రింద పడి బట్టలు పాడుచేసుకున్నాక పెద్ద నటులమయామని సంతోషించడం. తరుచు మా నాటకం ఆ సీనుతోనే మొదలు, ఎప్పుడూ ఆ సీనుతోనే ఆఖరు.

ఆ వయస్సులోనుండే వినీర్మలానందమంతా ఆ శకుంతలాదుష్యంతుల కథతోనే నా మనస్సులో ముడిపడిపోయింది. శాంతారాం రెండు సినిమాలు చూశాను. "కాళిదాసు" లో అంతర్నాటకంలో శకుంతల దుఃఖాన్ని చూస్తూ పక్కవాళ్లకు తెలియకుండా చెమర్చిన కళ్లు తుడుచుకున్నాను. రాబోయే "కులగోత్రాలు" లో అంతర్నాటకంకోసం వేయి కళ్లతో ఎదురు చూస్తున్నాను.

ఒక సుదినాన గుమ్మడిగారింట్లో, వారి సమక్షంలో చెరువు ఆంజనేయశాస్త్రి వ్రాసిన శకుంతల నాటకంలోనుంచి కణ్వునికి శకుంతల సెలవు చెప్పుతున్న భాగాన్నున్న పద్యాలను కవిముఖతా వినటం తటస్థించింది.

"వీడలేను జనకా ఎడబాయలేను జనకా
చేతులార పెంచినాను చివురులేయ పొంగినాను
ఈ చిరులత లేమానో చిన్నిప్రాణి లేమానో"

అని శకుంతల ప్రశ్నించగా కణ్వుని సమాధానము.

"తమ కీడగు తరుశాఖల పెనవేసుకు
బ్రతుకునులే
అదియె సహజీవనమ్ము అదె జీవిత ధ్యేయమ్ము
చరిత లలితకుంతలా చనుమా శకుంతలా"

వారు కవికే చేతనయే యుక్తరసయుక్తంగా చదువుతుంటే నా చిన్నతనం జ్ఞాపకంవచ్చింది. ఆ చిన్నతనం వీడిరావటానికి, ప్రపంచంలో స్వతంత్రంగా నాకు నేనై అడుగుపెట్టడానికి, చిననాటి చెలిమి ప్రోవులను విడనాడిపోవటానికి ఆ నాడు నాకెంత అసాధ్యమనిపించిందో హఠాత్తుగా భీకరాంధకారాన్ని ఛేదించిన విద్యుత్కరవాలంలాగా గుర్తుకు వచ్చింది. కణ్వుని మాటలు జీవితజ్యోతులు నాకు నేర్పిన పాఠాలే. "స్నేహితులనేచెట్లు నీడగా తోడుగా ఉంటారు. అదే జీవితవిధానం. అదే జీవిత పథం. అదే జీవితం."

మరొకచోట కవికాదు శకుంతల ప్రశ్నిస్తుంది:

"వర్షాగమ శుభవేళల హర్షమ్మున నర్తించే
ఈ మయూరి విడువజాల"

దానికి కణ్వుని, నా జ్యోతి ఓదార్పు:

"మధురవీణలు పలుకుచోటు వనమయూరముల
కేమిలోటు?"

ఈ విశాలప్రపంచంలో యెవరుకాకపోయినా, యెవరులేకపోయినా, యెవరు రాకపోయినా, ప్రకృతి కాంత గాలి వాలైనా చేయూత నివ్వదా!

ఈ ఆంజనేయశాస్త్రిగారే "పెళ్లికానుక"లో "ఆడేపాడే పసివాడా" సంతోషగీతం వ్రాశారు. ఇటీవల "తండ్రులు కొడుకులు" చిత్రంలో "నీ వలపే నీ తలపే" అనే తీయనిపాటను వ్రాశారు. దీనికి "హృదయాలు నిండునట్లుగా, కలలన్ని పండునట్లుగా" వరుసనమర్చి శ్రోతలను మంత్రముగ్ధులను చేశారు సంగీతదర్శకులు చలపతిరావు. చల్లనివేణువు. ఆ వేణువుకు అల్లనల్లన మెల్లన మురిపాలునేర్పేసితారు. హృదయవిపంచిలో ప్రతిధ్వనించేలా మధ్యలో సితార్‌తంత్రుల ధ్వనులు. అచ్చటచ్చట క్లెవైలిన్ వింతకాంతులు. జానకి గాత్రం మూర్తీభవించిన హాయి. చిక్కనైన చంద్రిక. ప్రజ్వరిల్లుహరివిల్లు.

రెండవప్రక్క మాధవపెద్ది పాడిన అల్లరి పాట, "మేరీ ప్యారీ" ఇటువంటిపాటలు వీరంత కవ్వించేలా, ఒళ్లు హుషారెత్తించేలా, అల్లరి కురిపించేలా మరొకరు పాడలేరు. ఏమంటారు? ఈ రికార్డునెంబరు జి. ఇ. 35223.

* * *

క్రిందటివారం హెచ్. ఎం. వి. స్టూడియోలో శబ్దగ్రాహకులు ఎస్. కె. సేన్ పర్యవేక్షణలో కొన్ని పాటలు, పద్యాలు రికార్డుచేయబడినవి. అందులో ముందు జరిగినవి పిఠాపురం నాగేశ్వరరావు పాడిన పద్యాలు. ఇవి సముద్రాల ఆంజనేయులు నాగార్జునసాగరమందున్న శిల్పసంపదపై రచించిన కవనామృతరసగుళిక, నాగార్జునసాగరము కావ్యఖండికలోనివి. ఈ నాలుగు పద్యాలకు రాగము తేర్చరచినది వి. గంగరాజు. వీరి ప్రతిభ, పేరు, ప్రతిష్ఠ, నాటకాల నవలోకించే రసికప్రపంచానికి సుపరిచితాలు.

"దీపింపదే నేడు దిగ్దిగంతముల నాగార్జుని బౌద్ధ నాగరికత" పద్యానికి యమన్, "దిశల దిగ్విజయంపు దివిటీలు పట్టించి ఇక్ష్వాకు లాంధ్రోర్వి యేలునాడు" అను పద్యానికి శ్రీ, "ఛాంతిమూల నృపాల చతురంగసేన సమరసన్నాహంబు సలుపు నాడు" అన్నదానికి మోహనరాగాలు నిర్ణయించారు గంగరాజు. కవి రచనలోను, పెట్టిన రాగములోను వీటన్నిటికి మణిదీపం "స్వాప్నమా అది కళారూపమా, యనిపించు రంగారు బంగారు రాతి పనులు" అన్న (కాపిరాగ) పద్యం. దీనిని పిఠాపురం సుశ్రావ్యంగా పాడగా వింటుంటే, పద్యాల నంతగా మెచ్చని నావంటివాళ్లుకూడ పరవశులైపోతారు. నాటి విజయపురీశిల్పుల చాతురీ పరీరంభణలో ప్రాణప్రతిష్ఠ చేసుకున్న శిల్పసుందరీమణులు మనోనేత్రంముందు మనోహరనృత్యం చేస్తారు. పిఠాపురం కంఠంలో యింతటి నేర్పు, సముద్రాల ఆంజనేయుల కలంలో యింతటి కూర్పు, గంగరాజు స్వరకల్పనలో యింతటి తీర్పు ఉన్నవి. పిఠాపురం పాడితే యిటువంటివి పాడాలి. హిందీఅనుకరణలు పాడనందుకు వీరిపైనా, పాడించనందుకు మంగపతిపైనా సంగీత సాహిత్య ప్రియులంతా హర్షపుష్పాలవర్షం కురిపిస్తారు. ఈ నాలుగు పద్యాలు సెప్టెంబరు మాసాంతంలో రాబోయే హెచ్. ఎం. వి. విడుదల.

కొలంబియావారు సెప్టెంబరు మధ్యలో విడుదలచేయటానికని శ్రీనివాస్ జానకి పాడగా రెండు పెళ్లిపాటలు రికార్డుచేశారు. ప్రజలనోట నేటికీ వినవస్తున్న ప్రాచీన పెళ్లిపాటలను దృష్టిలో ఉంచుకొని కాస్త ఆధునికపోకడలతో రాజశ్రీ కమ్మని గీతాలను వ్రాశారు. ఈ పాటలకు సంగీతం అమర్చినది శ్రీరామ్. అంటే రమేష్‌నాయుడు సహాయకులు. ఇంతకుముందు "సతీరేణుక" హిందీ చిత్రానికి, "అన్బు వడివు" తమిళ చిత్రానికి, శ్రీనివాస్, సుశీల పాడిన రెండు తమిళ యుగళ గీతాలకు వాద్యరచన చేసినవారు. పైపాటలు హిందీ పాటల అనుకరణలు కావు. స్వచ్ఛమైన తెలుగుదనంపు తీయందనం మొదలంటా వినబడే పక్కా దేశవాళీ పాటలు.

ఇటువంటి పాటలూ, పద్యాలే, ఇకపై బేసిక్ రికార్డులుగా వస్తే "హిట్ పెరేడోచ్చిన్నమిదం సంగీత్" అనే నింద గ్రామఫోను కంపెనీవార్ల పట్ల పట్టి నీలాపనిందైపోతుంది. శ్రోతలందరూ పాడండి. రెడీ! ఒన్, టు. "ఆరోజు భలే భలే మంచిరోజులే!"





# తమాషా

డి. హనుమంత రావు

ఆతను నెమ్మదిగా మెట్లెక్కుతున్నాడు.

రామ్మూర్తి కళ్లన్నింతకుముందు చూసినట్టు గుర్తు లేదు. సిటీకంతకీ పెద్ద కొట్టులో రామ్మూర్తి దొకటి. నాలుకబద్దాల దగ్గర్నుంచి ఫ్లాస్కులు, రేజర్లు, టాయిలెట్ సెట్లు వగైరా అన్ని రకాల ఫాన్సీ సామాన్లు, చాలా ఖరీదైన బట్టలు, ఇంకా ఎన్నో అక్కడ దొరుకుతాయి. అసలు నిజానికి కొట్టనకూడదు. కొట్టు అనగానే బల్లచెక్కల తలుపులు, వాటి ముందు వేళ్లాడంగా పెద్ద బల్ల, ఆ వెనకాల అడ్డదిడ్డంగా నాలుగైదు బీరువాలు— ఇవన్నీ జ్ఞప్తికొస్తాయి వాళ్లందరికీ. అందుకే రామ్మూర్తి దాన్ని ముచ్చటగా ఎంపోరియం అన్నాడు.

అతను కౌంటర్ దగ్గిర నిలబడి కొట్టంతా పరిశీలనగా చూశాడు.

రామ్మూర్తిని చిన్నప్పట్నుంచీ ఎరిగున్నవాళ్ళకి అతని చరిత్ర ఓ కథలాగుంటుంది. మొదట్లో ఓ చిన్న ఫాన్సీషాపులో బోయ్‌గా చేరాడు రామ్మూర్తి. మూడవ ఫారం ప్యాసవ్వడం తప్పించి వేరే విద్యార్హత లేదు. అయితే, వచ్చినవాళ్లని మర్యాదగా పలకరించి మాట్లాడ్డం, ఏంకావాలో తెలుసుకోడం, అవసరమైన వాళ్ల కావాలనే

— 47వ పేజీ చూడండి

# మంచి - మర్యాద

వి. సత్యవతీదేవి

నన్ను 'హైదరాబాదు'లో వేసినట్లు ఆర్డర్సు వచ్చేయి. నే ముండేది విజయనగరం ఉద్యోగం 'హైదరాబాద్' వెళ్ళేది కొత్త ప్రదేశం, పైగా బంధువులుకాని, స్నేహితులుకాని లేని ఊళ్ళో మొదట సామానుతో ఎక్కడ దిగడమా అన్న సమస్య ఎదురైంది హోటళ్ళ దిగకూడదా అనేరేమో కాని మహానగరం కొత్త ప్రదేశం ఒంటరిగా హోటల్లో ఎలా దిగడం ? మగవాళ్ళలా నిర్భావిగా ఎక్కడపడితే అక్కడ ఉండలేముగా నేనిలా అనుకొంటూవుంటే మా అన్నయ్య ఫ్రెండ్సు మాకు తెలిసినవాళ్ళు చాలామంది మావాళ్ళ హైదరాబాదులో ఉన్నారు ఉత్తరం ఇస్తాం అక్కడ దిగు' అంటూ మొదలు పెట్టేరు సరే అని ఇద్దరు, ముగ్గురి వద్ద మంచి ఇంట్రడక్షను లెటర్సు తీసుకొని జాగ్రత్త పరచుకొన్నాను

ఇంక రేపు బయలుదేరతాననగా మా నాన్నగారి స్నేహితులు ఒకాయన వచ్చి 'నీకేం భయంలేదు మా పినతల్లి కూతురు సికిందరాబాదులో ఉంది ఆమెభర్త గజిటెడ్ ఆఫీసరు చాలా పలుకుబడి ఉన్నవాళ్ళు, మంచివాళ్ళు నేను ఉత్తరం ఇస్తాను పట్టుకొని సరాసరి వాళ్ళింట్లోనే దిగు నిన్ను స్వంత మనిషిలా చూచుకొని కావలసిన సదుపాయాలన్నీ చేస్తారు అన్నారు సరే పెద్దాయన చెబుతున్నారు, ఏదో ఆదరవు దొరికిందికదా అని సరే అన్నాను ఆయన పాపం వెంటనే ఉత్తరం వ్రాసి ఇచ్చారు అందులో నన్ను ఇంట్రడ్యూస్ చేస్తూ అవసరమంటే 4, 5 రోజులు వాళ్ళింట్లో ఉంచుకొని ఏ లోపం రాకుండా చూడమని వ్రాసి ఇచ్చారు. ఆ రాత్రి మా నాన్నగారుకూడ నాతో "అన్నకుండా వాళ్ళింట్లోనే దిగమ్మా ఆయన మరీ మరీ చెబుతున్నారు పైగా వాళ్ళు చాలా మంచి వాళ్ళు పలుకుబడిగలవాళ్ళునట అటువంటి పెద్దవాళ్ళతో పరిచయం చేసుకొంటే ముందు ముందు ట్రాన్స్‌ఫర్సు విషయంలోకూడా ఏదైనా సహాయం చెయ్యవచ్చు' అన్నారు. నేను సరే అన్నాను

ట్రయిను కదులుతున్నప్పుడుకూడ నాన్నగారు వాళ్ళింట్లో దిగడం విషయమై నొక్కి నొక్కి చెప్పారు కాని నా బుర్రలో ఒకటే ఆలోచన వీళ్ళు ఎంత చెప్పినా వాళ్ళు ఎంత మంచివాళ్ళయినా నా అంతట నేను వెళ్ళి కొత్తవాళ్ళదగ్గర పరిచయం చేసుకోవడమంటే నాకు తగని మొహమాటం పైగా సామానుతో సహా వెళ్ళితే ఏమను కొంటారో ? ఒకవేళ నేను వెళ్ళేటప్పటికి వాళ్ళు లేకపోతే, అధమం వాళ్ళు ఉండి వాళ్ళ తత్వం నాకుగాని నా తత్వం వాళ్ళకుగాని నచ్చకపోతే ... ఆఖరికి ఆలోచించి ఆలోచించి తిన్నగా మొదట ఆఫీసుకే వెళ్ళిపోయి తరువాత సంగతి ఆలోచిద్దాం అని నిశ్చయించుకొన్నాను

హైదరాబాదులో దిగి మా ఆఫీసుకు వెళ్ళి ఆఫీసరుతో మాట్లాడితే భగవంతుడి దయవల్ల ఆమె వాళ్ళ డిపార్టుమెంటుకు సంబంధించినదే ఒక లేడీస్ హాస్టలు ఉందని, ఇల్లు దొరికేదాకా అందులో ఉండవచ్చని చెప్పారు. ఇంక నా సమస్య తీరి అందులో ప్రవేశించాను పదిహేను రోజులదాకా పనుల వల్ల తీరికలేక, కొత్త ప్రదేశం అవడంవల్ల ఎక్కడికీ వెళ్ళలేకపోయాను నాన్నగారివద్దనుంచి ఒక్కొటే ఉత్తరంమీద ఉత్తరం 'వాళ్ళింట్లో ఎందుకు దిగలేదు ? పెద్దవాళ్ళ పరిచయం ఉంటే మంచిదికదా ? పోనీ ఇప్పుడైనా వెళ్ళు' అంటూ సరే అది చూదాం అనుకొంటూ ఒక ఆదివారం నాడు నాకు బస్సురూట్సు సరిగా తెలియకపోవడం, రిక్షా వాళ్ళతో ఉర్దూ మాట్లాడటం చేతకాకపోవడంచాత ఇంకొక అమ్మాయినికూడ వెంటబెట్టుకొని సికిందరాబాదు పయనమయ్యాను.

వాళ్ళిల్లు ఎలాగో తెలుసుకుని గేటుదాటి లోపలి కెళ్ళితే గుమ్మంలో ఒక పనిపిల్ల అమ్మాయి కనిపించింది ఎవ్వరికే టెక్కాగే వేషం కనిపిస్తుంది నా ముఖం చూస్తూ ఏదో ఎవరనైనా అడగదు ఆఖరికి నేనే 'ఏమండి కమలమ్మగారు వున్నారా' అన్నాను. 'ఆ ఉన్నారు' అంది ఒకమారు పిలుస్తారా అన్నాను నేను తిరిగి వస్తా మండండి అని లోపలి కెళ్ళిపోయింది. నేను గుమ్మంలోనే నిలుచుండిపోయాను ఆ రెండంతస్తుల భవంతికేసి చూస్తూ అరగంట గడిచింది గంట గడిచింది లోపలినుండి ఎవరూ బయటకు కూడేవరు 'కూర్చోమనే దిక్కయినాలేదు నేనొక్కర్తినే అయితే ఫరవాలేదు. ఫ్రెండు కూడా వుంది ఏమిటీ అవస్థ పోనీ 'వెళ్ళిపోదామా అంటే తిరా లోనికి కబురు పెట్టినతరువాత వెళ్ళిపోతే వాళ్ళు ఏమనుకొంటారో ? ఇలా నేను ఆలోచనలో పడి కొట్టుకుంటూవుంటే ఇంతలో ఒక నలభై ఏండ్ల ఆవిడ బయటుకువచ్చి ఆ 'నేనే కమలమ్మను ఎవరు ? ఏంకావాలి ?' అంది. కంఠం గంభీరంగా వుంది ఆవిడ ప్రశ్నించే తీరుచూస్తే నాకు నోట మాట రాలేదు ఎలాగో కష్టంమీద 'నేను విజయ నగరంనుండి వచ్చాను మీ తమ్ముడుగారు పంపించారు అంటూ నేను బయలుదేరేటప్పుడు ఆయన వ్రాసిఇచ్చిన ఉత్తరం ఆవిడచేతిలో పెడుతూ 'యిది ఇప్పటిదికాదు, పదిహేనురోజుల క్రిందటిది' అన్నాను ఆవిడ ఉత్తరాన్ని తీసుకొని క్రిందకు మీదకు చూస్తూ రండి అంది లోపలికి దారితీస్తూ గదిలో ఆవిడ సోఫామీద కూర్చొని కళ్ళ జోడు తగిలించి ఉత్తరాన్ని చదువుతూవుంటే రెండుగంటలనుండి నిలుచొని నిలుచొని కాళ్ళు లాగుతున్నా ఎను ఆవిడ కూర్చోమనకపోయినా ప్రక్కను కుర్చీమని నేనూకూర్చున్నాను ఉన్నది ఒక్క పేజీయే అయినా గంటసేపు చదివిందా ఉత్తరాన్ని అంతా చదివి 'అయితే ఇప్పుడేం కావాలంటారు ? అంది నావైపు చూస్తూ నాప్రాణాలు పైనే ఎగిరిపోయాయి కొంచెం ధైర్యంతెచ్చుకొంటూ 'అది పదిహేనురోజుల క్రిందటి ఉత్తరమని మొదటే చెప్పానుకదండి! ప్రస్తుతం నాకేం అక్కరలేదు ఊరికనే మిమ్మల్ని కలిసిపోదామనివచ్చాను అన్నాను తిరిగి సర్వేశ్వరరావుగారు వున్నారా ? అన్నాను పోనీ ఆయననైనా చూదాం అని, లేరు బయటకు వెళ్ళారు వచ్చింతరువాత మీరువచ్చినట్లు చెబుతాలెండి అందావిడ నేను ఎక్కడ వుంటానో అని భయపడ్డట్లు

ఇంక నాకు ఒక్కక్షణంకూడ అక్కడ వుండ బుద్ధిపుట్టలేదు వెంటనే లేచి వస్తానండి అన్నాను 'మంచిది' అంది అతికష్టంగా మాటలు బయటకు తెస్తూ మెట్లుదిగేదాకా నా నోటంట మాటరాలేదు ఇంతలో మాస్నేహితురాలే ఇలాంటి వాళ్ళింట్లో మీవాళ్ళు ఎలా దిగమన్నారు సత్యా అంది ఆశ్చర్యపోతూ వాళ్ళకుమాత్రం ఏం తెలుసు అన్నాను మనసంతా అదోలా అయిపోయింది అంతదూరంనుంచి వచ్చాం అనిచెప్పిన తరువాత బంధువులం కాకపోతేమాత్రం కూర్చోపెట్టి నాలుగుమాటలు మాట్లాడితే వాళ్ళసొమ్మేం పోతుంది అక్కడితీరు చూచి నాకు ఆశ్చర్యం వేసింది ఇల్లంతా నాజూకుగా ఆధునాతన అలంకరణతో నిండివుంది కాని నాకు కనిపించిన వాళ్ళింట్లో ఒకవ్యక్తిలోనైనా కలుపుగోలుతనం మర్యాద కనిపించలేదు

ఇటువంటివాళ్ళు వీళ్ళొక్కళ్ళే కాదు ప్రపంచంలో ఎంతోమంది వుంటారు పెట్టిపోతల్లో ఏమీలేదు మాటల్లోనే మర్యాద వుండాలి పల్కరించి మాట్లాడితే వుండిపోతారని భయమో ఏమో ? అయితే అలావుండిపోయేవాళ్ళు కూడా వుంటారు లెండి 'చుట్టమై చూడవచ్చి దయ్యమై పట్టుకొంది' అంటారు మనవాళ్ళు అదీ నిజమే కాని అలా అని అందరినీ అదేవిధంగా తలుస్తే ఎలా ? డబ్బుండగానే సరికాదు దానికి తగిన మర్యాద మన్నన నేర్చుకొన్నవాడే దానికి తగిన విలువ ఇవ్వ కలుగుతారు లక్షలు లక్షలు ఆర్జిస్తూ మంచీ మర్యాదా వున్నవాళ్ళు వందలకొద్దీ వున్నారు. మంచితనానికి మర్యాదకు చదువుకొన్నవారని చదువులేనివారని బీదవారని గొప్పవారని భేదం లేదు అది వాళ్ళ చిన్నప్పుడు పెరిగే వాతావరణం మీద చాలామట్టుకు ఆధారపడి వుంటుంది

★



# ప్రపంచప్రముఖులు-11

మొదటినుంచీ అమెరికా సంయుక్త రాష్ట్రాల ప్రభుత్వం దక్షిణ అమెరికా పట్ల సరియైన విధానం అనుసరించలేదనే చెప్పవచ్చు. అమెరికా క్రమంగా ప్రపంచంలో కెల్లా సంపన్నవంతమయిన ప్రజాస్వామ్యంగా తయారయినప్పటికీ దక్షిణ అమెరికా దేశాల విషయమై నిర్లిప్తంగా ఉంటమే కాక ఆ దేశాలలో అభివృద్ధినిరోధకంగా ఉండే శక్తులతో చేతులు కలుపుతూ ఉండడం జరిగేది. వ్యాపారం బాఫీగా జరుగుతున్నంతకాలం దక్షిణ అమెరికా దేశాలలో ఎటువంటి నియంతలు పరిపాలిస్తున్నా పట్టించుకునేది కాదు. చాలా మట్టుకు ఈ నియంతలకు అమెరికన్ వ్యాపారసంస్థల మద్దతు లభించేది. అటువంటి నియంతలలో బాటిస్టా ఒకడు. ఇతని పరిపాలనలో ఎందరిని అన్యాయంగా హత్యచేశాడో లెక్కలేదు. అయినా ఫీడల్ కాస్ట్రో కలుగచేసుకునేదాకా బాటిస్టాని నిజంగా ఎదిరించి సాధించినవారెవరూ లేరు. కాస్ట్రో నాయకత్వం క్రింద చిన్న గొరిల్లా దండుగా ప్రారంభమయిన తిరుగుబాటు వరం చివరకు బాటిస్టాను అధికారంనుంచి దింపేసి విశేషంగా ప్రజాదరణకల ప్రభుత్వం ఏర్పరచింది.

మొదటలో అమెరికాలోనూ కాస్ట్రో పట్ల అభిమానం చూపిన అమెరికన్ వర్గాలు కొన్ని అతని విధానాలు వరీ కమ్యూనిస్టు విధానాలను పోలి ఉండడం చూసి క్రమంగా వైముఖ్యం ప్రదర్శించటం ప్రారంభించాయి. కెన్నెడీ అధ్యక్షుడయిన తర్వాత కాస్ట్రో ప్రభుత్వాన్ని కూలద్రోసే ప్రయత్నం ఒకటి జరిగింది.

కాస్ట్రో విధానాలు కొన్ని నిజంగానే విపర్యయాలకు దారితీశాయి. అనుభవంలేని వారందరూ వచ్చి ప్రభుత్వంలో పదవులు ఆక్రమించటంతో పెద్దపెద్ద తప్పులు చేశారు. నేడు క్యూబా ఆర్థిక పరిస్థితి చాలా ప్రమాదకరంగా ఉందని వింటాము. కమ్యూనిస్టులు అవలంబించి విఫలమయిన పద్ధతులు కాస్ట్రో అవలంబించడంవల్ల వ్యవసాయ ఉత్పత్తి దెబ్బతిని ప్రజలు కష్టాలకు లోనయ్యారని ఒప్పుకునప్పటికీ దక్షిణ అమెరికా దేశాల పట్ల అమెరికా బాధ్యత తగ్గదు. ★







# వనితావాణి,
ఆంధ్రసచిత్రవారపత్రిక,
7, తంబుచెట్టివీధి,
మద్రాసు-1

## భార్యాభర్తలమధ్య పొరపొచ్చాలు

అన్యోన్యత, అప్యాయత, కేవలం అభిప్రాయ భేదాలుండటంవల్ల లోపిస్తాయంటే అంగీకరించలేను. భార్యాభర్తల అభిప్రాయాలు కలుస్తే వాళ్ల అన్యోన్యత పెరగవచ్చు; కాదనను. కానీ, సంసారం సుఖవంతం కావటానికి అవసరమైనది భార్యాభర్తలు ఒకరి అభిప్రాయాలను మరొకరు అర్థం చేసుకోవడం, ఒకరి వ్యక్తిత్వాన్ని మరొకరు గౌరవించటం. నా 'క్లాస్‌మేట్' ఒకావిడకి మొదటినుంచి ఒక రాజకీయపార్టీ అంటే ఎంతో ఇష్టం. కానీ, ఆవిడభర్తకు ఆ పార్టీ అంటే పరమ అసహ్యం. ఎలక్షన్ టైములో వీళ్ళ ప్రచారాన్ని గమనించినవాళ్ళు ఎవరూ, వీళ్ళు భార్యాభర్తలంటే నమ్మరు. అయినా వాళ్ళ వైవాహికజీవితంలో జరిగిన రెండు జనరల్ ఎన్నికలు కూడా వాళ్ళ అన్యోన్యతను విడదీయలేకపోయాయి!

శ్రీమతి ఎస్ కమలారామం (విజయనగరం)

* * *

ఒకప్పుడు భర్త కోపగించుకున్నా కొంతసేపటికి అనవసరంగా ఆమెను బాధపెట్టానే అని పశ్చాత్తాపపడి, ప్రేమతో చూచుకుంటాడు. ఒకరి ఆశయ, ఆదర్శాలను వేరొకరు గమనించి ఆచరిస్తేనే సంసారం స్వర్గమయమవుతుంది.

శ. ఉషాహేమచందర్ (హనుమకొండ)

* * *

ఎప్పుడూ భర్తలనుచూచి నొచ్చుకొనే స్త్రీలకు ఇది తగిన వ్యాసము.

సరోజమ్మ (మద్రాసు)

* * *

ఒకరిమాట ఎందుకు వినాలి అనే పట్టుదలకలవారు ఇద్దరు ఆలోచించుకొని, ఇద్దరు ఒకమాటమీద ఉంటే ఆ పొరపొచ్చాలే రావుకదా! ఒకవేళ భర్త తెలివిగలవాడై, భార్య తెలివిలేనిదైతే భర్తే ఆ సంసారానికి పైచేయిగా ఉంటే బాగుంటుందేమో. భార్య తెలివిగలదయితే భర్త తప్పక భార్యసలహాలను తీసుకొంటూ, ఇద్దరు ఒకమాటమీద ఉండాలని నా అభిప్రాయము. అలా కాకుండా, కొంతమంది ఇండ్లలో భర్త ఎప్పుడూ నామాట వినాలి నే చెప్పి నట్లే నడుచుకోవాలి అనే భార్యలు ఉన్నారు. మరి కొన్ని ఇండ్లలో భర్తలు భార్య నా మాటే వినాలి. నా మాటప్రకారమే నడవాలి అనుకొంటారు. అలాంటప్పుడే ఈ భేదాభిప్రాయాలు. భార్యాభర్తలు ఇద్దరు ఒక మాటమీద ఉంటే, ఆ సంసారము స్వర్గతుల్యము. పిల్లలు క్రమశిక్షణతో పెరుగుతారు. వాళ్లకి మంచిబుద్ధులు వస్తాయి.

మాదిరెడ్డి లక్ష్మి (ప్రత్తిపాడు.)

* * *

శారదగారు వ్రాసినట్లు భర్తచేత చివాట్లు నేనెందుకు తినాలి, వాళ్ళ అదుపాజ్ఞలలో నేనెందుకు ఉండాలి అన్న అహంభావంగల యువతులు పెండ్లి చేసుకోవడమె మానుకోవాలి.

సి. హెచ్. విజయలక్ష్మి (బొబ్బిలి)

* * *

ఎంత చదువుకున్నస్త్రీ అయినా తన ధర్మాన్ని, బాధ్యతని గుర్తించి భర్తకి అనుగుణంగా నడిచి నప్పుడే వారి దాంపత్యం స్వర్గతుల్యమౌతుంది. అలా కాక, చదువుకున్నాననే అహంకారంతో భర్తని వ్యతిరేకిస్తే చివరికి వారే అగచాట్లపాలవుతారు. ఎంత మంచిహృదయముగల భర్తయినా ఎంత కాలమని భార్య వ్యతిరేకతని సహించకలడు? సంసారం స్వర్గంచేసుకోవటమనేది చాలమటుకు ఇల్లాలి మీదే ఉంటుంది. అలా అని, భార్యల్ని అసహ్యించుకునే భర్తలు లేరని నే ననను. నేను ఇటువంటి వ్యాసంకోసం చాలా రోజులుగా ఎదురుచూస్తున్నాము.

మాధవి (సిమ్నారు)

* * *

భార్యా భర్తలమధ్య పొరపొచ్చాలు అను వ్యాసం నూతన దంపతులకు ప్రధాన చిట్కా అనవచ్చును. సోదరి (రచయిత్రి) శారదగారికి నా కృతజ్ఞతాభినందనలు.

తాయారు (కొత్తగూడెం)

* * *

'భార్యాభర్తలమధ్య పొరపొచ్చాలు' అన్న వ్యాసం చదివాను. అందులో 'శారద'గారు పద్మమాటలుగా 'ఏ చదువుకోని ముద్దునో చేసికొంటే అది భర్త చెప్పినట్లుగా డూ డూ బసవన్నలా నడుచుకొనేదని' వ్రాశారు. ఈ రోజులలో చదువుకోని వారే చదువుకొన్నవారిని మించిపోయినట్లుగా వేష భాషలలోనేమి, ప్రవర్తనలోనేమి కనిపిస్తున్నారు. 'డూడూ బసవన్నలా' తలలూపే రోజులు ఏనాడో పోయాయి.

మాట వినడం, పనిచేయడంచేత భార్య భర్తలిద్దరి వ్యక్తిత్వానికి ఏమీ భంగంరాదన్న సత్యం తెలిసికొంటే ఎటువంటి పొరపొచ్చాలు రావు.

పద్మ (వైజాగ్)

* * *

వ్యాసం చదువుతుంటె ఈమధ్య జరిగిన ఓ సంఘటన జ్ఞాపకానికి కొచ్చింది. ఓ చిన్న విషయాన్ని పెంచి పెద్దచేసి, నిండుచూలాలైన భార్యను బాదబాదాడు భర్త. ఆ దెబ్బ ఆమె గర్భాని కెక్కడో తగిలింది. కడుపులోని బిడ్డకు ఆ దెబ్బ తగిలిందికాబట్టి పసికందు కడుపులోనే చనిపోయిందని లేడీడాక్టరు చెప్పగా అప్పుడు కుయ్యో మొర్రోమని ఆస్పత్రికి పరుగులు తీశారు. లేడీడాక్టరు ఆపరేషన్‌చేసి, బిడ్డను తీసివేసి తల్లిని బ్రతికించడానికి ప్రయత్నించింది. కాని, వారు ఆలస్యంగా ఆస్పత్రికి వెళ్ళడంవల్ల తల్లి ప్రాణం కూడాపోరీ అంది. తన తప్పు ఇప్పుడు తెలుసుకున్నాడు భర్త. కాని, చనిపోయిన ఆమె ప్రతికి రాదు. అతడు ఎంత రోదించినా ఆమెకు వినిపించదు. తప్పు మన్నించామని చెప్పదు.

నాగోజి నాగలక్ష్మి (పలమనేరు)

* * *

శారదగారు వ్రాసిన భార్యాభర్తలమధ్య పొరపొచ్చాలు బాగుంది. భార్యాభర్తలు మాట ఒకటైనప్పుడే వాళ్ల దాంపత్యం ఆదర్శప్రాయమవుతుంది.

దాసరి సూర్యకుమారి (కడియం)

* * *

భర్త ఆఫీసునుండిరాగానే చిరునవ్వుతో ఎదురు వెళ్ళి తన స్వహస్తాలతో తయారైన కాఫీని ఇద్దామని ఏ గృహిణికి ఉండదు? ఆ భర్త ఆఫీసునుండి ఏకాయకీ క్లబ్బుకివెళ్ళి రాత్రి ఏ 10 గంటలకో తిరిగివస్తే, ఆ గృహిణిమనస్సు ఎలా ఉంటుంది? ఆ క్లబ్బుకి వెళ్లేబదులు ఇంటికివచ్చి భార్యతో ఏ సినిమాకో, ఏ షికారుకో వెడితే ఆమె ఆనందించునుగా. కొంతమంది భర్తలు త్రాగుడు జూదము మొదలగు వెడువ్యసనాలు నేర్చుకొంటూంటారు. ఈ

వేరే వ్యసనా లందరికీ నేకకూడదంటే దాని గురించి పెద్ద పేచీలు అవుతాయ్ ఇటువంటి సంసారాల్లో పొరపొచ్చాలు రాకుండా ఎలా ఉంటయ్?

సుజాత (మోరి)

* * *

'వనితాలోకం'లో 'భార్యా భర్తలమధ్య పొరపొచ్చాలు' అనే వ్యాసం చదివాక ఈ ఉత్తరం రాయందే ఉండబట్టలేకపోయాను 'శారద'గారు బహుశ మగవారనుకుంటాను. లేకపోతే మరీ అంత మగవారి అభిప్రాయాన్ని బలపరుస్తూ వ్రాయరు.

భార్యా భర్తలలో ఇద్దరు ఒకరి అభిప్రాయాలని ఇంకొకరు అర్థంచేసుకోవడానికి ప్రయత్నించి, సర్దుకుపోవడం నేర్చుకోవాలి. భర్తయినంతమాత్రాన తన అభిప్రాయాలే భార్య శిరసావహించాలనుకోవటం పొరపాటు. చదువుకోని భార్యకైనా ఇంగిత జ్ఞానం ఉంటుంది. కనుక భర్త ఏది చెప్పితే అదే సరియైనదని తలాడించదు.

'ఇటు భార్యకూడా ప్రతిదానికి వాదానికి దిగకుండా వీలున్నంతవరకు ఎదురు సమాధానాలు చెప్పకుండా ఉంటే నయము

# వనితా వాణి

ఇద్దరుకూడా ఎప్పుడూ తాము చెప్పినదే వేద వాక్యమని, తాము చేసిందే సబబని అనుకోకుండా ఎదుట వాళ్ళని గురించి ఒక నిముషము ఆలోచించడం నేర్చుకుంటే ఏ పొరపొచ్చాలు ఉండవు అథవా వచ్చినా, త్వరలో పోతాయి.

శాంత (బొంబాయి)

* * *

శారదగారు మొదట్లో తన స్నేహితురాలు వాలి అభ్యుదయ ఆదర్శభావాలుకలదన్నారు. కాని, భర్త (ఎంత అధముడైనా) ఆతనిమాట ధిక్కరించడం, 'ఎందుకు వినాలి?' అనడం, 'నేను గంగిరెద్దునుకాను, చెప్పినదానికల్లా తలాడించడాని' కనడం ఒక ఆదర్శమహిళకు ఉండవలసిన లక్షణాలు ఏమాత్రం కావు. ఒకవేళ తన భర్త వట్టి మూర్ఖుడే కావచ్చు. అటువంటప్పుడు ఏ ఉన్నత ఆదర్శాలుగలభార్య అయినా ఆవిధంగా మాట్లాడదు. తన స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలను పూర్తిగా త్యాగం చేసి, భర్తకు అన్నివిధాల అనువుగా ఉంటూ, [illegible] నడవడికను భర్తకు ప్రసాదిస్తుంది. అప్పుడు వారి జీవితం ఆదర్శవంతమవుతుంది. అలా చేయడానికి చాల ఓర్పు, సహనం ముఖ్యం. అటువంటివి మన భారత నారీమణికే మాత్రమే సాధ్యమౌతాయి. అంతేగాని 'నేను చదువుకొన్నాను' 'నేను చెప్పినట్లు వారెందుకు వినకపోవాలి?' 'నేనంత తెలియనిదానినా' అనుకోడం అవివేకం. ఎంత చదువుకొన్నా, భారతమహిళ ఆదర్శమహిళగానే ఉండాలి. శైగా "చదువు, సంస్కారం దేనికి? మట్టిలో కలవడా? పెళ్ళి చేసుకొనేటప్పుడు తనకు తెలియదా ఆ విషయం?" అని సోదరి శారదగారు అనడం చాల విచారకరం. మనమే ఆ అశాంతికి కారణం. మన మహిళలే చక్కగా, సౌమ్యంగా, శాంతియుతంగా కుటుంబాన్ని నడపవలసినవారు, అదే గృహిణిబాధ్యత అని తెలుసుకోవడం చాల అవసరం. వారిని ఎత్తిపొడిచేకన్నా, మనలోవుండే సిరసత్వాన్ని గ్రహించి మసలుకోడం మంచిది.

"నిర్మల" (మాధవరాయ్నపాలెం)



ఇదీవరస—7

సుందర్

# కేశ శృంగారమునకు

# తగిన హేర్ ఆయిల్




## టాటావారి హేర్ ఆయిల్స

మన దేశ వనితలు చిన్నప్పటినుండియే కేశ శృంగార నిమిత్తం శిరోజాలకు నూనె రాసుకొని తలం దువ్వుకొనుటలో బాగా తరిఫీదై యుంటారు. హేర్ ఆయిల్‌ను శిరోజాలం కుదుళ్లంటా రుద్దుట వల్లనే శిరోజాలు సుందరంగా వుంటాయి. అందుచేతనే పుష్టియందుగల సహజ నూనెలను హెచ్చించే హేర్ ఆయిల్‌ను శ్రద్ధగా ఎన్నుకోవాలి.

టాటావారి హేర్ ఆయిల్స్‌లో ఆరోగ్యవంతమైన శిరోజాలను వొత్తుగా పెంచే శుద్ధమైన, ముఖ్యంగా ఇనికిపోయే పోషక సారములు వున్నవి.

టాటావారి కోకొనట్ మరియు కేస్టర్ హేర్ ఆయిల్స్ మనోహరమైన పరిమళం గలవి. మూడు సైజుల్లో లభించు చున్నవి.





సినీతి చంద్రిక

# చిత్ర ఖేదము

సుకుమార్

ఆ మర్నాడు ధనవంతుడు టిఫినూ, కాఫీ కానిచ్చి, మహాశయుడికోసం—మహోజ్జ్వల, మహత్తర చిత్రం కోసం ప్రజలు ఎదురుచూసినట్టు—చూడసాగాడు; కుమార రత్నం ఎందుకొచ్చిన తద్దినం అన్నట్టు ఫేస్ పెట్టి—రాకపోతే బాగుండును అన్నట్టు చూడసాగాడు.

కాస్సేపటికి ధనవంత కళ్ళు కాయలు కాశాయి, మరి కాస్సేపటికి పళ్ళు అయిపోయి, రాలిపోయాయి. అంచేత, మహాశయుడు వచ్చేసరికి—అతని కళ్ళు మామూలుగానే ఉన్నాయి.

"లేటా ?" అన్నాడు మహాశయుడు, కాల్‌షీటుకు ఆలస్యంగా వచ్చి, మామూలుగా నిత్యం వాడే, హీరో మాట వాడుతూ.

"ఎవరు ?" అన్నాడు కుమారరత్నం.

"నేనే."

"మీరా—మీరు లేకొందు కళ్యాణరండి—బతికే ఉంటేనా" అన్నాడు కుమారరత్నం నవ్వేస్తూ.

మహాశయుడు నవ్వలేదు. పైగా "నాయనా—ఈమధ్య సినిమాలలో హాస్యపు డైలాగులన్నీ నువ్వే రాస్తున్నావులా ఉన్నది—" అన్నాడు.

"మా అబ్బాయి రాయలేడు సుమండీ—వాడి స్నేళ్ళూ ఇంటిదగ్గరే ఉన్నాడు!" అన్నాడు అమాయకంగా ధనవంత.

"ఆఁ—ఊరికేలెండి" అని పర్నాడు మహాశయుడు, సోఫామీద వాలుతూ.

"కాఫీ తెప్పించమంటారా ?" అన్నాడు రత్నం.

"థాంక్స్—నో—వద్దు."

"సరే ఐతే, తొందరగా కానీండి—ఐయ్యాక ఎట్లాగూ తాగాలి—తలనొప్పి మాత్రతో" అని వినుక్కున్నాడు—కుమారరత్నం.

"నాయనా రత్నం—ఈమాత్రానికే నీకు విసుగు పుడితే ఎట్లాగయ్యా—రేప్పొద్దున తారలు, కాల్‌షీటుకు రాకపోతే నువ్వు నిరీక్షించాలిన నిరీక్షణ ఉంటే—"

"అందులో ఆనందం ఉంది."

"నువ్వుండ్రా కుమారరత్నం—వాడితో ఏమిటి మహాశయా—నువ్వు కానియ్" అని కుమారుడిని మందలించి, మహాశయుడిని అజ్ఞాపించాడు.

మహాశయుడు ఎత్తుకున్నాడు.

"ఆవిధంగా జన నేను, పోర్కు బెంచీ చేరి, థాంట్లో ఒక దివ్య భవ్య రమ్య హర్మ్యాన్ని నిర్మించు

-45వ పేజీ చూడండి

నెలరోజులు గడిచాయి. నా పరిస్థితి ఎట్లా ఉందో చెప్పలేను. నిర్మాతగారు మళ్ళీ రాలేదు. రోజూ చూడటమే అవుతోంది. సలహాను అడిగితే 'నాకేం తెలీదు' అంటున్నాడు. ఉత్తరంలేదు, పత్తరంలేదు. ఫలానా రాసిన నాలుగుత్తరాలకీ జవాబులేదు!

"వాడు సినిమా తియ్యటం అంటే ఏమిటో అనుకున్నాడండీ. బదారువందల్లో ఐపోతుంది అనుకున్నాడేమో! తీరా చూసేసరికి గుండె గుభేలు మంది. ఆమాట చెప్పడానికి సిగ్గుపడి, పత్తాలేని వెళ్ళిపోయాడు. గ్యారంటీ గుర్రూ—ఆ గుర్రుడు మరి రాడు! ఇదంతా నా అదృష్టం!" అన్నాడు ఫలానా ఓ రోజున—గ్లిసరిన్ లేదని, కళ్ళనీళ్ళు పెట్టుకోకుండా!

విన్నారా! ఆతర్వాత నా పరిస్థితులు ఎట్లా

## చిత్ర భేదము

(కత సంచిక తరవాయి)

పరిణమించాయో. ఆతర్వాత వివరిస్తాను. ఒక నిక్కచ్చి ఐన చిత్ర నిర్మాతకూ, తీస్తానని బెదిరించే నిర్మాతకూ గల చిత్ర భేదం; కథకూ, చిత్రానికీ గల చిత్ర భేదం; బెంగాలీ కథకూ, మన చిత్రానికీగల భేదం. ఒక చిత్రానికీ, మరో చిత్రానికీ గల భేదం; ఒకరికీ మరొకరికీగల భేదం. సలహాకూ, ఫలానాకూ, కవికీ, నిర్మాతకూ; నాకూ, మరొకరికీ గల భేదం—ఇట్లా ఎన్నో భేదాలు వున్నాయి. ఈ భేదాల మొత్తమే 'చిత్రభేదము.'

(సి)నీతిచంద్రికలోని 'చిత్రభేదము' మీరు విన్నారు. తర్వాతభాగం రేపు వివరిస్తాను" అని ముగించి, సిగరెట్టు ముట్టించాడు మహాశయుడు.

"బాగా తెలుస్తోంది" అన్నాడు ధనవంత, నిట్టూరుస్తూ.

"కొంత అర్థమయింది" అన్నాడు కుమారరత్నం—లేస్తూ.

"మంచినీళ్ళు" అన్నాడు మహాశయుడు.

"మంచినీళ్ళా—" అని అరిచాడు ధనవంత.

ఆరు, ఏడు చెంబులతో, పలురకాల గ్లాసులతో మంచినీళ్ళు వచ్చాయి—వాటిని అనుకుని నౌకర్లు వచ్చారు! మగ్గుల్లు తాగాక, కుమారరత్నం బయటకు వెళ్ళాడు. మహాశయుడు 'రేపు వస్తాన'ని ఇంటికి వెళ్ళాడు. ధనవంతుడు నిద్రపోయాడు. మిగిలిపోయిన మంచినీళ్ళను ఏం చెయ్యాలో తోచక, నౌకర్లంతా అటూ, ఇటూ చూస్తూ నించుని కాస్సేపటికి కాళ్ళు లాగగా, కింద చతికిలబడ్డారు! ★



మూర్తి

ఫుట్‌బాల్ గ్రౌండ్ అంతా చూడవచ్చినవారితో దీర్ఘచతురస్రంలా తయారయింది.

ఆడబోతున్న రెండు టీములూ గట్టివే! అందరూ మంచి ఆటగాళ్లే.

సరీగా ఇండియన్ స్టాండర్డ్ టయిము నాలు గయింది. సర్కసులో మొదట అందరూ క్యూలో పరిగెత్తుకుంటూవచ్చి ఒక రౌండుకొట్టి వెళ్ళి పోయినట్టుగా, రెండు టీముల్లోని ఆటగాళ్ళు ఒకరివెనుక ఒకరు ఎవరివేపు వారు గ్రౌండులో ప్రవేశించారు.

ఉత్సాహం పట్టలేని ఒక సుబ్బారావు బంతిని ఆకాశంలోకి తన్ని ఊరుకున్నాడు అందరివేపు గర్వంగా చూస్తూ.

"బోడిగొప్ప" అన్నది వసంత పక్కనున్న గిరిజతో జనాంతికంగా.

శ్యామల పక్కున నవ్వింది.

అంపైరు వేసిన విజిలుకు జవాబుగా ఆటగా ళ్ళందరూ మధ్యకు చేరుకున్నారు.

మరి రెండు నిమిషాలకు ఆట ప్రారంభమయింది. కుశాలరావు బంతిని 'పాసాన్' చేసుకుంటూ అడ్డు వచ్చిన ప్రత్యర్థులను తప్పించుకుంటూ గోలుకు ఇరవైగజాల దూరందాకా వెళ్ళి, బంతిని బలంగా తన్ని కళ్ళు మూసుకుని వెనక్కు తిరిగాడు.

"గోల్, గోల్!" అనే అరుపులు మిన్నుముట్టేయి.

గోలు అయిపోయిందనుకుని కళ్ళు తెరిచి వెనక్కు తిరిగిన కుశాలరావుకు గోలుకీపరు హుసేన్ కబంధ హస్తాల్లో చిక్కుకున్న బంతి కనపడి ఉసూరు మన్నాడు.

మళ్ళీ ఆట మొదలయింది బంతి—బంతివెంబడి బూట్లకాళ్ళు పరిగెత్తుతున్నాయి. గెంతుతున్నయి. అవసరంవచ్చినప్పుడు తన్నుకుంటున్నయి.

వసంత, గిరిజ, శ్యామల వరసగా నిలబడి చూస్తు

—41 వ పేజీ చూడండి





ఒరేయ్ వీడు ఈరోజుగా ఏడుపు మానేలా లేదు ఓసారి నువ్వు బజారుకెళ్ళి వీడికి చొక్కాల్లు బొమ్మలూ పాలూ అవీ తీసుకురా
సరేలే నువ్వు వీడిని జాగ్రత్తగా చూసుకో




తలుపు తలుపు
వచ్చే వచ్చే వస్తున్నా వస్తున్నా




ఎవరండీ మీరు ఎవరు కావాలి?




1
అయ్యో నీ మొహం ఈడ్చా! ఎవత్తివే నువ్వు? నా ఇంటికే వచ్చి నేనెవర్నని అడుగుతావు? అసలు మా ఆయనకీ నీకు సంబంధమేమిటి?
2
సంబంధమేమిటంటావా? శంకరం నేను చిన్నప్పటినించి స్నేహితులం. చిన్నప్పటి నించి ఒకకంచంలో తిని ఒకమంచంలో పడుకునే వాళ్ళం




ఆసి నిన్ను తగలెయ్యా! ఎంత ధైర్యంగా చెప్తున్నావే!!
అంటూ పొట్లాలన్నీ ముఖానికి విసురుతోంది




అదే సమయానికి ఇంట్లోకి వస్తున్న శంకరం —
అయ్యబాబోయ్... నువ్వెప్పుడొచ్చావేవ్
ఎంత ధైర్యం ఎంత సాహసం నేను ఇంట్లో లేకుండా చూసి దీన్ని ఇంటికి తెచ్చుకుంటావా? నీకు సిగ్గులేదు




ఎవరినే వదిలా.. వీడు ఇరవై రోజులనించి మన ఇంట్లోనే ఉంటున్నాడు
అసలు సంగతి చెప్తా విను



జీసస్ మాటలు వింటున్న క్లాడియా ముఖమంతా విచిత్రానుభూతితో ఆక్రమమయమైంది.

**సినిమాకథ :**

# కింగ్ ఆఫ్ కింగ్స్

## జరిగిన కథ

రోమన్ సైనికులు జెరూసలేంను ఆక్రమించినకాలంలో జోసెఫ్, అతడి భార్య మేరీ బెతల్హాం చేరారు మేరీకి గుర్రాల పాకలో జీసస్ జన్మిస్తాడు ఆ శిశువును సంహరించేందుకు జెరూసలేం రాజు హిరాడ్ ప్రయత్నించగా జోసెఫ్ మేరీలు ఈజిప్టుకు పారిపోయి, ఆంటిపస్ రాజ్యానికి వచ్చాక జెరూసలెంకు తిరిగివస్తారు

రోమన్‌లను విప్లవకారులెదిర్చి ఓడిపోతారు ఆత్మప్రబోధం వల్ల జీసస్ ఎడారి ప్రాంతాలలో గడిపి వస్తాడు సలోమీ, హిరాడియాలు తమ పాపాలను విశదపరుస్తున్న బాప్టిస్టు జాన్ తల తీయిస్తారు జీసస్ అనేక అద్భుత కృత్యాలు చేస్తాడు

ఇది అయిన కొన్నాళ్లకు జీసస్ అనుయాయులు సమావేశం కాబోతున్నారనే వార్తను లూసియస్ పాంటియస్ పిలేట్‌కు తెల్పాడు.

"జాన్ మళ్లీ బ్రతికివచ్చినట్లున్నాడు వెంటనే నిర్బంధించండని" హిరాడ్ గోలపెట్టినా, తగిన కారణం లేందే జీసస్‌ను నిర్బంధిస్తే విప్లవం చెలరేగవచ్చని, మతాధికారి కైఫస్ చెప్పటంవల్ల ఆంటిపాస్ లూసియస్‌తో ఇలా అన్నాడు

"సైన్యాన్నంతటినీ మారు వేషాల్లో తీసుకుపో. అతడు చెప్పేదంతా వినండి. రోమ్‌కు వ్యతిరేకంగా, కుట్రగా ఒక్కమాట పలికినా నరికి అవతల పారేయ్!"

ఆరోజు రాత్రి గలిలీ కొండదగ్గర అశేష ప్రజానీకం చేరారు పిన్నలు, పెద్దలు, ఆడ, మగ అంతా అందులో జీసస్‌తల్లి మేరీ, మారువేషంలో పిలేట్ భార్య క్లాడియా, ఛద్మవేషాలలో రోమన్ సైనికులు, లూసియస్, విప్లవవాది బరబ్బాస్, జూడాస్‌లు వారి అనుయాయులు కూడా వున్నారు.

ఆ కొండ అగ్రభాగాన జీసస్ ఒక్కడూ నుంచొని సందేశం ఇవ్వటం ప్రారంభించాడు.

"నిర్ధనులారా! భగవద్రాజ్యము మీది కనుక మీరు ధన్యులు.

సాత్వికులారా! భూలోకమున మీకు మనుగడ కలదు కనుక మీరు ధన్యులు.

నీతిమార్గానుసరణ పిపాసువులారా! సంతృప్తానుష్ఠానము లభించును గనుక మీరు ధన్యులు.

కరుణామయులారా! ప్రతిగా కరుణను పొందు మీరు ధన్యులు.

శోకసంతప్తులారా! మీకు శాంతి లభించును కనుక మీరు ధన్యులు.

పరిశుద్ధాత్ములారా! దైవదర్శనము పొందు మీరు ధన్యులు.

శాంతి సంధాయకులారా! భగవత్సంతానముగా పేరెక్కు మీరు ధన్యులు

నీతికొరకు ప్రాణమిచ్చు త్యాగులారా! భగవద్రాజ్యము మీది: మీరు ధన్యులు."

సమావేశానికి హాజరైన ప్రజల్లో పలువురు తమతమ సందేహాలను అడిగారు.

'భగవంతుని రాజ్యమెక్కడుంది?' "నిలోనే" "మీరు ప్రవక్తా?"— "తను పెంచే గొర్రెలకోసం ప్రాణమిచ్చేటి కాపరిలాంటివాడిని." "పరమపదం పొందాలంటే ఏంచేయాలి?" "తోటిమానవుణ్ణి ప్రేమించు, శత్రువులనుకూడా ప్రేమించటం నేర్చుకో"

ఈమాట వింటున్న క్లాడియా శిరస్సు క్రిందికి వాలిపోయింది.

—39 వ పేజీ చూడండి

## నెలకి 5 రూపాయలతో మీ ఇంట గ్రంథాలయం నెలకొల్పండి!

# నెలకు రు 5 చొ॥ 18 నెలల చందా పూర్తి చేస్తే

# మీరు కట్టే 90 రూ॥లకు 100 రూ॥ల పుస్తకాలు పంపుతాము

ఈ పుస్తకాలను 120 పబ్లిషర్ల ప్రచురణలు - దాదాపు 1700 ఉత్తమ గ్రంథాలనుండి ఎన్నుకోవచ్చు

## ఇవికాక 10 ఉచిత పుస్తకాలు లభిస్తాయి

ప్రత్యేకం ఎన్నిక చేసిన ప్రచురణల నుంచి వీటిని ఏరుకోవచ్చు

## ప్రణాళిక ద్వితీయ వార్షికోత్సవ సందర్భాన కొత్త చందాదారులకు ఉచిత పుస్తకాల సంఖ్య 9 నుంచి 10 కి పెంచాము

## పుస్తక ప్రియుల పత్రిక 'పుస్తక ప్రపంచం' 18 నెలలు ఉచితంగా పంపిస్తాం

## వీటన్నిటికీ పోస్టేజీ మేమే భరిస్తాము



చందాదారులు ఒకవేళ తప్పనిసరై నా, ఏకారణంచేతనైనా అర్థాంతరంలోనే చందా మానివేయదలిస్తే నిరాక్షేపణగా మానివేయవచ్చు. అయితే, ఆపక్షంలో, అప్పటికి వారు కట్టిన చందాదామాషాన పరిపోయే పుస్తకాలు మాత్రమే వారికి వస్తాయి. అప్పుడు వారి ఖాతాలో నిలవ ఉన్న మొత్తం తేల్చేవిషయంలో అప్పటికి వారికి పంపించిన ఉచిత పుస్తకాల ధరలు కూడా పట్టీ వెల ప్రకారం లెక్క గడతారు.

### మొదటి 5 రూ చందా కట్టగానే

1. మీరు ఏరుకొనే మూడు ఉచిత పుస్తకాలు
2. "పుస్తక ప్రపంచం" పత్రిక
3. 1700 తెలుగు పుస్తకాల వివరాలున్న పెద్ద కేటలాగు - ఉచితంగా అందుతాయి

### చందా 6 నెలలు కట్టేసరికి

మా కేటలాగులోంచి మీరు ఏరి కోరుకునే 30 రూపాయల పుస్తకాలు అపైన మరో రెండు ఉచిత పుస్తకాలు అందుతాయి




### 12 నెలలు తిరిగే సరికల్లా

మరో 30 రూపాయల పుస్తకాలూ
మరో 2 ఉచిత పుస్తకాలూ

### 18 నెలలు పూర్తికాగానే

మరో 40 రూపాయల పుస్తకాలూ
పైగా మరో 3 ఉచిత పుస్తకాలూ అందుతాయి

## మీకు ఉచితంగా లభించే మొదటి మూడు పుస్తకాలనూ ఈ క్రింది 8 నుంచి ఏరుకోవచ్చు

- F 6 పౌరుడు - రాజ్యాంగము ప్రతి పౌరుడూ తెలుసుకొనవలసిన విషయాలు
- F 7 ముళ్ళపూడి వెంకటరమణ కథలు — ఆంధ్రుల అభిమాన హాస్యరచయిత కథల సంపుటి
- F 8 కథ-I. చిన్న కథలకు నిర్వచనాలనదగ్గ పెదకొండు కథల సంపుటి
- F 14 పులుల సత్యాగ్రహం - కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి నవల
- F 15 ఆశాప్రియ పఖ్యాత రచయిత శ్రీ బుచ్చిబాబుగారి నవల
- F 18 తల్లి - బిడ్డ పసిబిడ్డల పెంపకంలో తల్లి బాధ్యతల గురించి శ్రీమతి దర్శి సుభద్రమ్మగారి వివరణ
- F 22 ఆణిముత్యం శ్రీమతి ఆరుద్ర తెనిగింపు
- F 23 బాలరాజు పిల్లలకి వినోదం, పెద్దలకు విజ్ఞానం కలిగించే కథలు ఆస్కార్ వైల్డ్ రచన శ్రీ నండూరి రామమోహనరావుగారి తెనిగింపు

బహిష్టు రోజులకు...










సారిడన్ నొప్పులనుండి త్వరితముగా, నిశ్చయముగా, నిరపాయముగా స్వస్థత కలిగించును. తలనొప్పి, ఒంటినొప్పి, పంటినొప్పి, జ్వర చిహ్నములు, మామూలు అస్వస్థత లకు సారిడన్ వేసుకోండి.

# సారిడన్

'రోష్'




ఒకే ఒక బిళ్ల చాలును

ఒక బిళ్ల ఖరీదు 13 నయా పైసలు

నొప్పిని పోగొట్టును, సేదదేర్చును,
నవోత్సాహము కలిగించును

'రోష్' తయారు ఏకైక డిస్ట్రిబ్యూటర్లు : వాల్టాస్ లిమిటెడ్

JWT-VT 3527



## జరిగిన కథ

'వెండిమబ్బు' యజమాని సదాశివరావు గారు, తమ ఏకైక పుత్రిక ఇందిరను మోహనుడికిచ్చి వివాహం చెయ్యాలని నిశ్చయించి, పైచదువులకు అతణ్ణి అమెరికా పంపుతారు. మోహనుడు అమెరికా వెళ్ళిన కొద్ది కాలానికే ఇందిర తల్లి లలితమ్మగారు గిరిరాజును కని కన్ను మూస్తారు. అమెరికానుంచి తిరిగి వచ్చిన మోహనుడు ఇందిరతో వివాహానికి ఇష్టపడడు. అతడి అంతర్యం కనిపెట్టిన ఇందిర మనస్సు వికలమై తోటనుంచి ఇంటిదారి పడుతుంది. వెనుక వస్తున్న మోహనుడు గోతిలోపడి గాయపడతాడు. రావుగారు అతణ్ణి ఇంటికి చేర్పించి వైద్యసదుపాయాలు ఏర్పాటు చేస్తారు. ఇందిర పరిచర్యవల్ల కోలుకుంటున్న మోహనుడికి ఆమెయందు అనురాగం కలుగుతుంది.

(గతసంచిక తరువాయి)

మోహనుడికి మెలకువ వచ్చేసరికి గదిలో గిరి కూర్చున్నాడు.

అతడి చేతిలో రంగుగుర్రం ఉంది.

కాలక్షేపంకోసం బిడ్డను పలకరించా డతడు.

ఎప్పుడూ అంతగా పలకరించని మోహన్ తనను పలకరించేసరికి గిరికి ఆశ్చర్యం వేసింది. కొన్నిమార్లు గిరి అతడిని మాట్లాడించినపుడు-బిడ్డవైపు కన్నెత్తి చూసే ఓపికకూడా లేని మోహన్ ఇప్పుడు తనను పిలుస్తున్నాడు.

"గిరి, ఇలారా"

"ఊఁ"

"నీ ఆటవస్తువులన్నీ తీసుకుని రా. ఇద్దరం ఆడుకుందాం.

"ఊఁ"

"బంగారుకొండవికదూ. తీసుకుని రామ్మా మరి."

గిరి అనుమానిస్తూ లేచి నిల్చున్నాడు.

"ఇదిగో! కళ్ళు మూసుకుంటున్నాను. మళ్ళీ కళ్ళుతెరిచేలోగా అన్నీ తేవాలి."

గిరి ఉత్సాహంతో బయటకు పరుగెత్తాడు.

బీరువా, కిటికీ ఎక్కడెక్కడో ఉన్న వస్తువులన్నీ ఏరి పట్టుకొచ్చి మంచంమీద పరిచాడు గిరి.

"ఇన్నేనా?"

"ఊఁ"

"మంచంమీదకు ఎక్కుమరి."

గిరి మంచంమీదకు ఎక్కడానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు. మోహనుడు తన కుడిచేతితో వాణ్ణి పైకితీసుకుని కూర్చోబెట్టుకున్నాడు.

మోహనుడి ఎడమచెయ్యి, ఎడంకాలు చూపించి "ఉవ్వా?" అన్నాడు గిరి.

"అవును బాబూ. డాక్టరు అబ్బు చేశారు." గిరి ప్లాస్టరును చేతితో నిమిరాడు. తరువాత గుర్రంతో దానిమీద కొట్టాడు.

"అఁ"—అంటూ నొప్పిని నటించాడు మోహన్. ప్రొద్దుపోవటానికోసం ఇష్టంలేకుండానే ఆట ప్రారంభించాడు మోహన్. క్రమంగా బిడ్డతో ఆడుతూ, ఆడుతూ తానూ ఒక బిడ్డ అయిపోయాడు.

—36 పేజీ చూడండి





## కథాపరిభాషాకోశం

ఆధునిక (వార) పత్రిక కథా రచయితల పరిభాషా కోశము: మచ్చుతునకలు.

హాసించాడు=నవ్వాడు.

కంపించింది=వణికింది.

పృచ్ఛించాడు=అడిగాడు.

ఆనంద బా(భా)ష్పాలు = కన్నీటి చుక్కలు. (?)

గంభీరముద్ర=ఏడుపు మొహం.

కించిత్=కొంచెం.

ఆలకించాడు=విన్నాడు.

అశ్రుబి(భి)ందువులు = కన్నీటి చుక్కలు.

హృది=గుండె(?)

ఆశయం=ఇష్టం(?)

గానం=పాట.

కె. కార్తవీర్యార్జునశర్మ (దేవాల...)

* * *

## కలియుగ విదుర

ఆపదగాయుట, యితరుని
పాపంబుని జాలిపడుట, పనిబడువేళన్
ఓపిన సాయము జేయుట,
పాపములై కలియుగాన బరగెడు నధిపా!

పాపభయంబు, సధర్మా
క్షేపంబును, శాంత సహన శీలతలును, సద్
వ్యాపారత్వము, నమవిని
కాపురుష గుణంబులయ్యె కలియుగమందున్.

నిత్యాన్నదానపరతయు,
సత్యవ్రత పాలనంబు, సన్మార్గగమం





అత్యంత నిష్ఠ, మతిపెడు
కృత్యంబులు, కలియుగాన, క్షితిపతి వింటే!

పేకాట రానివాడును,
రూకలతో జూదమాడ రోసెడి వాడున్,
షో తెరుగనివాడును, నవి—
వేకులర్షై కలియుగాన వెలయుదు రధిపా!

వేసంబునేసి మోసము
చేసిన దోసంబటంచు చింతిలువాడున్,
కాసలు నేర్వని వాడును
కాసుకు గొరగానివాడు కలియుగమందున్.

ఉత్తరే అంతా ఫియర్
అసలు 'వార్' అంటే
ముందు "కిడ్నపింగ్" వుండాలి
కదా!

అమెరికన్ 'సీత'ను
రష్యన్ 'రావణాసురుడా?'
రష్యన్ 'హెలెన్'ను
అమెరికన్ జన్ లా?

కానజల్లు
అనవరతం జాగ్రత్త!

పంటి బాధ
ఇంటి బాధ
పడతి వేధ
తెలియపరచ కెవ్వరికి !!

చంటి పాప
కంటి చూపు
మింటి తార
ప్రేమింపు మెల్లపుడు!

పాలు జడ
బరువు మెడ




నరసజ్జనుడైన మనుజుడు
పరివారంతోడ తగవు పలుపడు, వారల్
విరసించి కసరికొట్టిన
భరియించును స్వీయకార్యఫలసిద్ధికినై.

ఒరు లేదారిని నడచిన
నరవర యాదారివెంట నడచుటయే
పరమావధి, కలియుగమున,
పెరదారిన బడిన వరుడు వేదనపాలౌ

పర స్త్రీల వెంబడించుట,
పరిహాసముకొరకు పరుల బాధించుట, నౌ
తెరచిన నవ్వుతములాడుట
సరదాలగు కలియుగాన జనులకు నృపతీ!

పి. యస్. రంగారావు, (భద్రాచలం)

* * *

ఎవరేత్తుకు పోయార్?
అన లాడదాన్ని రంగంలోకి
తేకండా
ప్రణయకాండ లేకండా
ఛా! ఛా! యుద్ధకాండ యింపాజిబిల్
జేరింగ్గా అంటున్నా
శాంతంగావుంటుంది వర్ల్డ
రానేరాదు వర్ల్డ వార్ థర్డ్!

—కృష్ణానంద్.

* * *

పొడుగు గడ
బాధాకర మందరకు !!

నంద్ శ్రీ (గుంటూరు)

* * *

తెలుగు మాష్టారు వ్యాకరణము బోధిస్తూ ఒక అమ్మాయి తో "అలంకారాలు ఎన్ని అమ్మా" అని అడిగారు.

అమ్మాయి తడుముకోకుండా "చాలా ఉన్నాయండి-పౌడరు రాసుకొనుట, స్నో పూసుకొనుట, లిప్ స్టిక్ రాసుకొనుట, ఇంకా ఎన్నో వున్నాయండి" అంది.

జి. రామమోహన (హైద్రాబాదు)

అంతా లాజిక్ కాబోలు!?

వర్ల్డ వా రెందుకు
వస్తుంది బ్రదర్

జాగ్రత్త

ఈతముల్లు
తాటకల్లు




దైవజ్ఞపాతూరి శ్రీరామమూర్తి

**24-8-1962 శుక్రవారము మొదలు**
**30-8-1962 గురువారము వరకు**

### మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ప్రస్తుతం గ్రహబలం అనుకూలంగా ఉన్నది. సాధారణంగా జరుగబోయేవాటిని గురించి ముందే ఊహించి ఉండటంవల్ల అందుకు తగిన పద్ధతిలో నడుచుకోగలుగుతారు. అధికారులు మీ మాటను ఆదరించి అనుసరిస్తారు. న్యాయమార్గంలో మీ బాధ్యతలను ప్రశాంతంగా నెరవేర్చుకొనగలుగుతారు. బంధువుల ఇండ్లకు ప్రయాణం చేయవలసివస్తుంది. మనసులో ఎప్పుడూ ఆలోచిస్తూ ఉండటంవల్ల శారీరకంగా బలహీనత తోస్తుంది. వృత్తి ఉద్యోగాలలో స్వబుద్ధిని ఉపయోగించగలుగుతారు. క్రొత్తగా పైనపడే ఖర్చులను సర్దుబాటుచేయటం శ్రమగా తోస్తుంది. చాలాకాలంగా మిమ్ములను కంగారు పెడుతున్న వ్యవహారాలు ఒక మార్గానికి వస్తవి. 25, 26 తేదులలో అనవసర కలహాలు, అధిక శ్రమతోకూడిన కార్యక్రమాలు.

* * *

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

మీరు చురుకుగా ఉన్నామని అనుకుంటారు. కాని, కొన్ని సమయాలలో మీ పరిస్థితి "చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకున్నట్లే" అవుతుంది. మీ పొరపాట్లు పరుల దృష్టిలో పడకుండా చూచుకోగలుగుతారు. ఆదాయం మామూలుగానే ఉంటుంది.

> **గ్రహస్థితి**
>
> మిధునంలో అంగారకుడు, కర్కాటకంలో రాహువు, సింహంలో సూర్యుడు, సింహ, కన్యలలో బుధుడు, కన్యలో శుక్రుడు, మకరంలో శని కేతువులు, కుంభంలో గురువు, వృషభ, మిధున, కర్కాటక, సింహాలలో చంద్రుడు.

పిల్లల మూలంగా సంతోషకరమైన కాలము. సాహిత్యము మొదలయిన విద్యా సంబంధమైన కృషికి అనుకూలంగా ఉంటుంది. సంఘంలో అనుభవం కల పెద్ద మనుష్యులు మీ కార్యక్రమాలకు సహాయం చేస్తారు. కుటుంబంలో జరిగే పనులు ప్రశాంతంగా సాగిపోతవి. వారాంతంలో బంధువులవద్ద నుంచి ప్రోత్సాహకరమైన వార్తలు తెలుస్తవి. 29, 30 తేదులలో అకస్మాత్తుగా వస్తునష్టం, కార్యభంగం, నౌకరులు మొదలయిన వారితో విరోధం.

* * *

### మిధునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ధర్మంగా పాటుపడటం మంచిదేకాని, తోటివారు సుముఖంగా లేకపోవటంవల్ల మీ కష్టం అక్కరకు రాదు. చేతికి రానున్న ధనం అకస్మాత్తుగా నిలిచిపోతుంది. ఉష్ణప్రకోపంవల్ల దేహబాధలు కలుగుతవి. ఈ సమయంలోనే ముందు ఎప్పుడో జరుగనున్న వ్యవహారాలను గురించి ధనవ్యయం చేయవలసిన అవసరం వస్తుంది. వృత్తిలో మిమ్ములను భయపెట్టేవారు ఉంటారు. నిబ్బరంతో ఉండవలసిన సమయం. అధికారులను సంప్రదించటం వంటి పనులు సంతృప్తికరంగా సాగే సమయంకాదు. వారం రెండవ భాగంలో మీకు సంబంధంలేనివారు కూడా ఏదో సంబంధం కల్పించుకొని మీ సహాయం పొందటానికి చూస్తారు. జరగటానికి అవకాశం లేని పనులయందే ఆసక్తి కలుగుతుంది. 26, 27 తేదులలో వృత్తిలో పోటీ, కార్యభంగం.

* * *

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

ఎప్పటికప్పుడు మనస్సు వెనకాడుతున్నా, బంధుమిత్రుల ప్రోత్సాహంతో క్రొత్త వ్యవహార, వ్యాపారాలలో ప్రవేశించగలుగుతారు. అయితే ప్రతికూలత అనేది ఉండదు. తూర్పు, ఉత్తర దిక్కుల మంచి ధనలాభం ఉంటుంది. చట్టావ్యాపారం వంటివాటిలో ప్రతికూల సూచన లున్నవి. ఈ సమయంలో సంతోషము, సుఖము పూర్తిగా లభించే అవకాశాలు తక్కువ. తలవని తలంపుగా జరిగే కొన్ని సంఘటనలు చికాకును కలిగిస్తవి. చేతిలోని ధనం ఖర్చు అవుతుంది. కాని, మనశ్శాంతిమాత్రం తక్కువ. బాహ్య విషయాలలో బెట్టుసరిగా ఉండటంవల్ల జరుగనున్న పనులు కూడా మధ్యలో ఆగిపోయే అవకాశాలున్నవి. మాటలలో తొందరపడవద్దు. 29, 30 తేదులలో పొరపాట్లు, సంచారం.

* * *

### సింహాం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఈ సమయంలో మీ మాటకు అభ్యంతరం ఉండదు. ఈశ్వరానుగ్రహంవల్ల మీరు ప్రయత్నిద్దామనుకునే కార్యమే మీ వద్దకు వస్తుంది. హాస్యానికి అనుకొన్న మాటలే క్రమక్రమంగా కార్యరూపం పొంది మీపేరు ప్రతిష్ఠలకు అవకాశం కలుగుతుంది. కుటుంబంలో శుభ సమయం. విలాస

వినోద విషయాలపైన ఎక్కువ ధనం వినియోగిస్తారు. మీరు చెప్పిన సలహా పదిమందికి సంతృప్తికరంగా చలామణి అవుతుంది. కొన్ని సమయాలలో నీచ స్వభావంకలవారితో కలిసి పని చేయవలసివస్తుంది. అందువల్ల మీ వార్తలు మీ విరోధులవద్దకు చేరకుండా చూచుకొనటం అవసరం. అధికారము, హోదా పెరుగుతవి. ఇండ్లు, భూములు మొదలయినవి కొనటం, అమ్మటంవంటి పనులు లాభకరంగా పూర్తి అవుతవి. 25, 26 తేదులలో ప్రయాణ సూచన, ఆదుర్దా కలిగించే వార్తలు, బంధు విరోధం.

* * *

## కన్య :

(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ధైర్యంతో సాధించలేని పని అంటూ ఉండదు. ముఖ్యంగా మీ ఆరోగ్యము, ఉత్సాహము బాగుంటవి. గౌరవప్రదమైన కాలము. ప్రతిఫలంలేని పనులుకూడా చేస్తూ ఉంటారు. అయితే నిరుత్సాహం తోచదు. విద్యార్థులకు మంచి సమయం. ఈ సమయంలో నిర్ణయించుకొనే కంట్రాక్టులు, మాట ఒప్పందాలు సులభంగా నెరవేరి క్రమక్రమంగా ముందుకువెళ్ళటానికి అవకాశం లభిస్తుంది. ధనాదాయంకూడా ఇంతకు ముందుకన్నా బాగుంటుంది. మిత్రులవల్ల మీపైనబడిన కార్యభారం తగ్గిపోతుంది. కుటుంబంలో జరుగు పనులు మీ మనస్సుకు ఉత్సాహకరంగా తోచవు. యదార్థంలోపం అంటుఉండదు. 28, 29 తేదులలో వృధాసంచారం, నౌకరులతో కలహాలు.

* * *

## తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)

మాట దబాయింపుతో పనులు జరుగుతవి. కాని, అంతరంగంలో ఎక్కడ వ్యవహారం బెడిసికొడుతుందో ననే భయం పట్టుకుంటుంది. ప్రస్తుత ఆదాయం స్థితిగతుల ననుసరించి కార్యక్రమాలను సవరించుకొంటూ, మాటను కాపాడుకొనగలుగుతారు. గ్రంథ పఠనం, ముఖ్యమైన లెక్కలు మొదలయినవాటిలో శ్రద్ధ చూపలేకపోతారు. పైకి మాట్లాడకుండా మంచిగా కనుపిస్తూ, క్రియలో మీమీద భారం వెయ్యటానికి చూచేవారుంటారు. ముందు జాగ్రత్త అవసరం. శుభకార్య ప్రయత్నాలు మధ్యస్థితిలో ఆందోళనను కలిగిస్తవి. అయితే భంగంమాత్రం కాదు. మాటలతో కాలక్షేపంచేసే మనుష్యులతో జాగ్రత్తగా మసలుకొనవలసిన సమయం. ముందు ఎప్పుడో మీకు లాభం కలుగజేస్తామనే మాటలను నమ్మవద్దు. 27, 28 తేదులలో నిరుత్సాహము, నిరుపయోగమైన ఆడంబరము, కష్టవార్తలు.

* * *

## వృశ్చికం :

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)

ఎదటివారిని ఏవిధంగా సంతృప్తిపరచటమో తెలియక ముందు ఆందోళన కలుగుతుంది. కార్యభారము, ఖర్చులు కూడా పెరిగే అవకాశాలున్నవి. ఆదాయం బాగుంటుంది. అధికారులవల్ల నెరవేరవలసిన వ్యవహారాలు మళ్లీ మొదటికి వచ్చి, చికాకును కలిగిస్తవి. ప్రతి విషయంలోనూ పట్టుదలలు పెరుగుతవి. ఫలితం చేతికి వచ్చే సమయంలో మనం పెద్దగా సాధించింది ఏమీలేదు అనే భావం తోస్తుంది. ప్రయాణాలు చేస్తారు. శుభవార్తలు తెలుస్తవి. ధన వ్యయం అవుతున్నకొలదీ కార్యరంగంలో ఒక్కొక్క మెట్టు పైకి పోగలుగుతారు. నిదానంగా ప్రయోజనం పొందగలుగుతారు. విశ్రాంతి చాలా తక్కువ. ఆడంబరంతో కూడిన సమయం. 25, 26 తేదులలో ఆందోళన, సుఖభంగం.

* * *

## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

మీరు సక్రమమైన పద్ధతిలో నడచుకొనటం వల్ల ఇతరుల మాటలను లెక్కచేయవలసిన అవసరం లేదు. ఆర్థికస్థితి, గౌరవముకూడా బాగుంటవి. లోగడ మీరు వ్రాసిన ఉత్తరాలవల్ల ఈ సమయంలో ప్రయోజనం పొందగలుగుతారు. పుణ్యక్షేత్రాలకు ప్రయాణం చేస్తారు. కుటుంబ విషయాలలో మీ భయాందోళనలు తొలిగిపోయి, స్థిరమైన మార్గంలో నిలబడగలుగుతారు. అబద్ధాలు చెప్పి మిమ్ములను రచ్చకు లాగటానికి చూచేవారు ఒకరిద్దరు తటస్థపడతారు. జాగ్రత్తగా ఉండండి. మీ మాటను అపార్థంచేసుకొనే బంధువులు కూడా ఉన్నారనే విషయం మరచిపోవద్దు. చట్టా వ్యాపారంవంటి సాహస కార్యాలకు పూనుకొనటం మంచిదికాదు. వ్యవహార రంగంలో పరిష్కార మార్గం లభిస్తుంది. 27, 28 తేదులలో మాట పట్టింపులు, కార్యభంగము.

* * *

## మకరం :

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

మీ కోరికలను సాగించుకొనటానికి తగిన అవకాశాలు లభిస్తవి. అయితే "పరువెత్తి పాలు త్రాగటంకన్నా నిలబడి నీరుత్రాగటం మేలు" అనే భావంతో ముందుకు సాగటం అవసరం. మీరు వ్రాసే ఉత్తరాలవల్ల పదిమందికి మీయందు ఆదరాభిమానాలు కలుగుతవి. ఈ సమయంలో నిరాడంబరంతో చల్లచల్లగా అందరి కన్నా పైస్థితికి పోగలుగుతారు. పిల్లలమూలంగా మన సంతోషం లభిస్తుంది. దక్షిణదిక్కునుంచి వచ్చే వార్తలు న్యాయసమ్మతంగాను, ఉత్సాహదాయకంగాను కనుపించవు. ఈ సమయంలో ఎవరు ఏది చెప్పినా మీరు ప్రత్యక్షంలో చూడకుండా నిర్ణయం చేయవద్దు. డబ్బుపెట్టుబడి పెట్టటం మంచిదికాదు. కుటుంబంలోనివారి అర్థంలేని ప్రసంగాలవల్ల విసుగుదలతోస్తుంది. 29, 3 తేదులలో సంతోషభంగం, ధర్మకార్యాలూ.

* * *

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

కోర్టు కచేరీలలో పనులు సులభంగా జరుగుతవి. వృత్తి వ్యాపారసంబంధమైన లావాదేవీల "రోగి పాలే కోరాడు, వైద్యుడూ పాలేత్రాగమన్నా అన్నట్లుగా ఉంటుంది. మొదట్లో డబ్బు ఇబ్బంది కలిగేటట్లు తోస్తుంది. అయితే మీ కోరకుండానే సమయానికి లభిస్తుంది. సం కార్యాలలో గౌరవం దక్కుతుంది. మానసికం కూడా ప్రశాంతమైన కాలం. శుభ, పుణ్యకార్యా భారీగా చేయగలుగుతారు. గతకాలంలో ఏర్ప ఋణబాధ మీ జాగ్రత్తవల్ల క్రమంగా తీరిపోతుం అధికారులతో ధైర్యంగా మాట్లాడి, జయ సాధించగలరు బాహ్య విషయాలలో విశ్రా లేకపోవటంవల్ల కుటుంబ విషయాలలో ఎక్క ఏ పొరపాటు జరుగుచున్నదీ గ్రహించుకోలేకపోతా అందువల్లనే ఆరోగ్యంకూడా తగ్గుతుంది. ఎదు చూస్తున్న వార్తలు సమయానికి అందవు. 2 25 లలో ఇష్టంలేని పనులు, మాటపట్టింపు

## మీనం :

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి

హాస్యప్రసంగాలు పాకంముదరకుండా చూ కొనండి. ప్రయాణావకాశాలున్నవి. మీకు సం ధించిన వారివల్ల ఎక్కడ ఏ లోపం జరిగినా బాధ మీపైకి రాగల సమయం. పడమరదిక్కునుం కష్టవార్తలు వినవలసి వస్తుంది మధ్యవర్తి వంటి బాధ్యతలలో ప్రయాసతో మా దక్కించుకొనవలసి వస్తుంది ధనం ఒకరి చే పోకముందే మీ జాగ్రత్తలో మీరు ఉండటం అ రం. చాలాకాలంగా ఆశపెట్టుకొన్న ఒక వ్యవహా చేయిదాటిపోయిందనే విషయం తెలుస్తుంది దు స్తోత్ర పారాయణం, పూజ జరుపుకొనటంవ చిక్కులనుంచి చల్లగా తప్పించుకుని క్షేమ లాభా పొందగలుగుతారు. 29, 30 లలో మనశ్శాం తక్కువ. గౌరవ లాభం, మీకు సంబంధం కార్యభారం.

## ఈ వారము ధరలు

బంగారు ధర ఈ వారంచివర కొద్దిగా పెరుగుతుంది. వెండి ధర 25, 26 తేదులలో పెరిగి, వారం రెండవభాగంలో తగ్గుతుంది. నూలుకు గిరాకి వస్తుంది. వేరుశనగ పప్పుధర గతవారం మందీలో నిలుస్తుంది. అయితే 29, 30 తేదులలో తేజీ సూచన, వేరుశనగనూనె ధర నిలకడగా ఉంటుంది. పెద్ద మార్పులు ఉండవు. నూవులధర తగ్గుతుంది. చింతపండు ధర అకస్మాత్తుగా తగ్గే అవకాశాలున్నవి. బెల్లంధర గతవారంకన్నా తేజీ వస్తుంది. కాని, నిలవకపోవచ్చు.

గిరి ఆటలు, ముద్దుమాటలు, ముగ్ధత్వం, అల్లరి మోహన్ మనస్సును ఆకర్షించాయి. మోహన్‌తో ఆడుతూ, ఆడుతూ గిరి సంతోషంగా కేకలువేస్తూ మంచంమీద గెంతుతున్నాడు.

"బబ్బ?" అన్నాడు గిరి.

"నా చేతకాదు గిరి. అబ్బుకాలు. నడవలేను"—అన్నాడు మూలుగుతూ మోహన్.

"నాకూ అబు"— అన్నాడు గిరి, తనకూ నొప్పవుతున్నట్టుగా నటించడానికి యత్నిస్తూ.

బిడ్డ మొహంచూసి మోహన్‌కి నవ్వు వచ్చింది. ముద్దు చిలికింది.

అతడు కుడిచేతితో అతడిని లాక్కుని బుగ్గల మీద ముద్దుపెట్టుకున్నాడు.

తలుపుదగ్గర నవ్వుతూ నిల్చున్న ఇందిరనుచూసి గిరిని వదిలాడు మోహన్.

"అక్క" అంటూ గిరి మంచంమీదనుండి దిగబోయాడు.

మోహన్ గబుక్కున బిడ్డను పట్టుకుని క్రిందికి దింపాడు.

గిరి అక్కదగ్గరకు పరిగెత్తి వెళ్ళాడు.

ఇందిర కాఫీ, ఫలహారం తెచ్చి మోహన్ దగ్గరగా ఉన్న బల్లమీద పెట్టింది.

తాను ముద్దుపెట్టుకునేటప్పుడు ఇందిర చూసే సిందేమో!

"ఎంతసేపటినుండి తలుపుదగ్గర నిల్చున్నావు ఇందిరా?"

"ఇప్పుడే వచ్చాను."

"అయితే .... నువ్వు ...."

"మీరు గిరిని ముద్దుపెట్టుకున్నది నేను చూడలేదు. కాని, వంటింట్లోకే వినిపించింది"

మోహన్ మొహం ఎర్రబడింది.

"ఏదో ఆటలోపడి......" నసిగాడు మోహన్.

"సరేలెండి. ఫలహారం చేయండి."

"నాకు ఆకలిగాలేదు."

"దయచేసి..."

"ఒద్దు ఇందిరా."

"భోజనంకూడా సరిగా చేయలేదు."

"నాకు ఆకలిగాఉంటే నేనే తింటాను నువ్వు ఎందుకు ఇంత బలవంతం చేస్తావు?"

"మీరు మా అతిథి మీరు ఇక్కడుండేవరకూ మిమ్మల్ని సరిగ్గా చూసుకోవటం మా కర్తవ్యం."

కర్తవ్యం! కర్తవ్యం మినహా వేరే భావనలేమీ ఆమెలో లేవా?

"నీ కర్తవ్యం నాకు హింస."

"నిజంగానా?"

"అవును"

"ఇలా మొండికేయకండి మోహన్ మనస్సుకు ఎంత విసుగ్గా ఉన్నా, దేహాన్ని శిక్షించరాదు"

"ఫలహారం తెచ్చిపెట్టటం నీ కర్తవ్యం. కాని అది తినటం, తినకపోవటం నా ఇష్టం"

పుట్టయ్య లోపలికివచ్చి మోహన్‌చేతికి రెండు ఉత్తరాలు ఇచ్చి వెళ్ళాడు.

ఒకటి అతడి నాన్నగారిదగ్గరనుండి వచ్చింది ఇంకొకటి ఒక కంపెనినుండి మోహన్‌కి ఉద్యోగం

# వెండిమబ్బు

31వ పేజీ తరువాయి

దొరికిందని, మొదటి తారీకునుండి పనిలోకి చేరవలసిందిగానూ ఆర్డర్ వచ్చింది.

ఉత్తరం చదవగానే మోహన్ మొహం తెల్లబడింది.

"ఏం, ఏమయింది?"

"ఏమీలేదు. ఉద్యోగం దొరికింది—మీ నాన్నగారి పరిశ్రమా ప్రభావాలవల్ల."

"ఓ" అంది ఇందిర.

"మంచి జీతమే వస్తుంది. నాలుగు వందల యాభై నెలకు. ఇల్లు—కారుకూడా కంపెనీ ఇస్తుంది.

"సంతోషం."

ఒక శాస్త్రవేత్త ఉపన్యసిస్తున్నాడు: "31 కోటి 50 లక్షల సంవత్సరాల తరవాత ప్రళయం వస్తుందని నేను వేసిన లెక్కలు తెల్పుతున్నాయి."

ముందు వరసలో కూర్చున్న ఒక పెద్దమనిషి భయంతో ఎగిరిపడి "ఎన్ని సంవత్సరాలకన్నారు?" అని కంగారుగా అడిగాడు.

"31 కోటి 50లక్షల సంవత్సరాలకు."

"హమ్మయ్య! కోటి యాభై లక్షల సంవత్సరాలకే వస్తుందని అదిరిపోయాను." ఆ పెద్దమనిషి స్థిమితపడ్డాడు.

జయంతి (కటక్)

"కాని ఫస్టుతారీఖుకు వెళ్ళగలనా అని యోచిస్తున్నాను.

"రెండు నెలలు ప్లాస్టర్ వేసుకోండి. తరువాత ప్లాస్టర్ తీసేసి ఎక్సరే తీయించి ఏవిషయమూ చెప్తానన్నారుగా డాక్టరుగారు ఎల్లుండి వెళ్ళి చూపించిరండి తరువాత మిగిలిన విషయాలు ఆలోచించవచ్చు"

తనకు అగాధంగా కనిపించిన విషయాలన్నీ ఇందిరకు తృణసమానాలు.

"తరువాత?"

"అన్నీ నేనే చెప్పాలా? తరువాత ఏం చేయాలో ఆలోచించుకోండి"

"నాకు చేతకాకనే మరి నిన్నడగటం."

"నన్నడిగితే అది మీ యోచన అవదు. నా యోచన అవుతుంది."

"మీ నాన్నగారు ఇంట్లో ఉన్నారా?"

"ఆ పిలుస్తాను" అంటూ వెళ్ళింది ఇందిర.

లోపలికొచ్చిన రావుగారికి మోహను కంపెని దగ్గర్నుండి వచ్చిన ఉత్తరం అందిచ్చాడు.

ఉత్తరం చదివి రావుగారు సంతోషంతో ముందుకు వచ్చి మోహన్‌తో కరచాలనం చేశారు. మోహనుడి చేయి చల్లగా నిర్జీవంగా ఉంది.

"చాలా సంతోషం మోహన్‌రావ్."

"అంతా మీ దయ ఇందులో నా యోగ్యత ఏమీ లేదు."

"ఎల్లుండి డాక్టరుగారిదగ్గరకు వెళ్ళివద్దాం ఫస్టు తారీఖువేళకు మీకు బొంబాయికి వెళ్ళటానికి వీలు కాకపోతే నా మిత్రుడికి ఉత్తరంరాసి, అతడిమూలకంగా ఇంకో పదిహేనురోజులు ముందుకు వేయిస్తాను. ముందు డాక్టరుగారిదగ్గరకు వెళ్లొద్దాం."

"అలాగే"

"మీరు వెళ్ళి పనిలో చేరండి. నేను ఇక్కడి పనులు చూచుకుంటాను. ఇక రెండు నెలలు మంచి లగ్నాలులేవు. తరువాత శుభలగ్నంలో పెళ్ళి ఏర్పాట్లు చేస్తాను."

మోహన్ ఏమీ మాట్లాడలేదు అతనిముఖం పాలిపోయింది ఏమో మాట్లాడాలని ప్రయత్నించాడు. కాని మాట్లాడలేకపోయాడు.

"ఇందిరా, మోహన్‌రావుగారికి ఉద్యోగం దొరికింది."

"తెలిసింది, నాన్నా"—అంటూ వచ్చింది ఇందిర.

"ఇంక నేను చేయాల్సిన పని ఒక్కటే—మీ పెళ్ళి" రావుగారు తమ హాస్యానికి తామే నవ్వారు.

ఇందిరా, మోహన్ నవ్వలేదు కాని ఇద్దరి మొహాల్లోనూ జీవంలేదు.

ఇందిర తన్ను తాను నిగ్రహించుకుని చెప్పింది. "పెళ్ళియోచన ఇప్పటినుంచీ ఎందుకు నాన్నా? ముందు అన్నిపనులూ సక్రమంగా సాగనివ్వండి. ఇప్పుడు పెళ్ళికేం తొందరా?"

"అలా అంటే ఎలాగమ్మా? ఊఁ అలాగేలే!.... ముందు మోహన్‌కు నయమయ్యి పనిలో చేరనీ. తరువాత మిగిలినపనులు" అంటూ లేచి వెళ్ళిపోయారు రావుగారు.

పళ్లెంలోని ఫలహారం, గ్లాసులోని కాఫీ అలాగే ఉండటంచూసి ఇందిర, "ఏమిటీ అన్యాయం?"—అంది.

"నాకు వద్దు."

"ఉద్యోగం దొరికిన సంతోషంకూడా?"

"ఇందులో నాదేముంది? అంతా మీ నాన్నగారి ప్రభావం అంతే."

"ఆయన ప్రభావంతో చాలామందికి ఉద్యోగాలు దొరికాయి. మీరు అలాంటి సంకోచమేమీ పెట్టుకోకండి."

"కాని, అమెరికా వెళ్ళివచ్చినవాడిని నేనొక్కడినే. డబ్బు, ఉపకారం, స్నేహం—ఇన్ని బరువులతో బంధితుడినయ్యాను నేను. ఈ బరువు నేను మొయ్యలేను ఇందిరా."

"ఆ బరువు దింపుకోవటానికి నన్ను పెళ్ళిచేసుకోవాలని మీరు మళ్ళీ అనుకుంటున్నారా?"

ఇందిర కంఠం కటువుగా ధ్వనించింది.

మోహన్ కాస్సేపు మెదలకుండా ఉండి, తరువాత నిదానంగా ఇలా అన్నాడు.

"నీకు ఇప్పుడు ఎంత కఠినంగానన్నా మాట్లాడటానికి హక్కు ఉంది ఇందిరా. నాకు మాట్లాడే అధికారం కూడా లేదు. కాని, నా మనసులో ఉండేదంతా ఈరోజు చెప్పదల్చుకున్నాను.

కాఫీతోటయజమాని ఏకైక పుత్రికవన్న కారణంచేతనే నిన్ను పెళ్ళి చేసుకోవటానికి ఒప్పుకున్నాను. చూడడంతోటే ఆకర్షించేరూపంకాదు నీది. నిన్ను పెళ్ళిచేసుకోవటంవల్ల నీ తండ్రి ఆస్తంతా నాకు లభిస్తుందన్న దురాశతోనే నేను నిన్ను చేపట్టటానికి ఒప్పుకున్నాను. నువ్వు నాలో ఏం చూసి ఆకర్షితురాలివయ్యావో నాకు తెలీదు.

నేను అల్లుడినవుతానని మీ నాన్నగారు నన్ను స్వంతఖర్చుతో విదేశాలకు పంపించి, పై చదువులు చదివించారు.

నీకు తమ్ముడు పుట్టాడని వినగానే నా ఆశలన్నీ నీళ్ళుకారిపోయాయి. మీతండ్రి ఆస్తిమీదనే కన్నుంచిన నన్ను నిరాశ ఆవరించింది. అప్పుడే నిన్ను పెళ్ళిచేసుకోనని రాసేద్దామనుకున్నాను. కాని నా చదువుకు ఇబ్బంది కలుగుతుందన్న భయంతో ఊరుకున్నాను.

ఇక్కడికి వచ్చాక, నా మనస్సులో ఉన్న విషయం నీతో చెప్పి, నన్ను విడుదలచెయ్యమని వేడుకున్నాను. నువ్వూ ఒప్పుకున్నావు. నువ్వు అంత తేలిగ్గా విడుదల చేయటం నాకు చాలా ఆశ్చర్యాన్ని కలుగచేసింది. నువ్వు నా మాటవిని కోపంతో మండిపడతావని, నోటికి వచ్చినట్టు తిడతావని అనుకున్న నా ఊహలు తారుమారయ్యాయి. నే ననుకున్నట్టే జరిగిఉంటే ఇప్పటి సన్నివేశమే వేరుగా ఉండేదేమో? అప్పుడే అనుకున్నాను—నువ్వు అందరిలాంటి దానివి కావని.

అప్పటి నీ ప్రవర్తన, శాంతం నన్ను ఆకర్షించాయి.

నేను చెయ్యి, కాలు విరగకొట్టుకుని ఇక్కడే ఉండాల్సొచ్చినతరువాత, నీతో ఇన్నిరోజులు గడిపాక, నీ స్వభావం, గుణం, వ్యక్తిత్వాల పరిచయం లభించింది నాకు

మెప్పువల్ల స్నేహం — స్నేహంవల్ల ప్రేమ. మొదట్లో నాలోని పరివర్తనను గమనించలేదు. గమనించాక అదే నాకు ప్రియమయింది.

నీది అంత ఆకర్షించగల సౌందర్యం కాకపోయినా నీ గుణాలకూ, మనోబలానికీ, స్వభావానికీ లొంగిపోయాను.

మొదట్లో నా భావనలను నాలోనే అణచుకోపడానికి ప్రయత్నించాను. నా భావాలు నీ ముందు వ్యక్తపరచడానికి నాకు చాలా హైన్యంగా ఉండేది. ఆఖరికి—ఆస్తి ప్రశ్నే నా మనసులోంచి తొలగిపోయింది.

మీ నాన్నగారినుండి నాకు దమ్మిడీ కూడా అక్కర్లేదు. మీ నాన్న గడించినవాటిలో అమూల్యమైన ఇందిర నాకు దొరికితే చాలు అని నా మనస్సు కోరింది.

ఉపకారం బరువు దించుకోవటానికి నేను నిన్ను పెళ్ళిచేసుకోగోరటంలేదు. ఆ బరువు ఈ జన్మలో దించుకోలేను. ఆ ప్రయత్నమూ చెయ్యను.

కాని, నా విదేశ వ్యాసంగానికి మీ నాన్నగారు ఖర్చు చేసిన డబ్బు మాత్రం వెనక్కి ఇచ్చేయాలనుకుంటున్నాను.

ఉపకారం బరువు దింపటానికి నేను నిన్ను పెళ్ళి చేసుకోగోరటం లేదన్న నామాట నమ్మగలవా ఇందిరా?"

ఇందిర పరీక్షగా అతడి మొహంలోకి చూసింది.

సుమారు రెండు నెలలుగా ఎండతగలని మోహన్ నుడిమొహం తెల్లగా పాలిపోయింది.

అయినా ఎంత అందం అతడిది! చేతికీ, కాలికీ వేసిన ప్లాస్టరుకూడా ఏదో ఒక ఆభరణంలాగా మరింత అందాన్నే ఇస్తోంది అతడికి.

ఆమె వేళ్ళు బూడిదరాశిని కెలికాయి.

ఒక్క నిప్పురవ్వయినా ఉండకూడదా?

దీర్ఘంగా నిట్టూర్చి అంది ఇందిర, "నమ్ముతాను."

"నా మనసులోని విషయమంతా నీతో చెప్పాను. క్షమించటం చేతనయితే క్షమించు. ఈ కుటుంబంతో నా కెంత ఆత్మీయత కలిగిందంటే—ఇప్పుడు దీనిని వదిలి వెళ్ళటమే కష్టమనిపిస్తోంది."

"క్రమంగా అన్నీ మరిచిపోవచ్చు."

"నేను ఒక పెద్ద తప్పు చేశాను. ఫలితంగా శిక్ష కూడా నేనే అనుభవిస్తాను"

"శిక్షేమిటి?"

"ఇందిర ఎప్పటికీ నాకు పరాయిపిల్లగానే ఉండిపోవటంకన్నా వేరే శిక్ష ఏంకావాలి?"

ఇలా చెపుతూ నవ్వాడు మోహన్. నవ్వి ఇలా అన్నాడు.

"హృదయ దౌర్బల్యానికే మరోపేరు ప్రేమ. స్వభావతః దుర్బలుడిని నేను. ఇంత శక్తిగల "దౌర్బల్యాని"కి లోనయ్యానంటే ఆశ్చర్యమేమీలేదు. ఏ దౌర్బల్యానికి నేను బలిఅయ్యానో దానిని నీవు అధిగమించావు."

"కాఫీ చల్లారిపోయింది. వేరే తెస్తాను" అంటూ లోపలికి వెళ్ళింది ఇందిర.

* * *

ప్లాస్టర్ తీసేశాక కూడా మోహన్ నాలుగు రోజులు 'వెండిమబ్బు' లోనే ఉన్నాడు.

"నాలుగురోజులు నడవటం అలవాటు కావాలి. వెంటనే బయల్దేరకపోతేనే మంచిది"—అని సలహా ఇచ్చారు డాక్టరుగారు.

ఆ నాలుగురోజులూ అతడు గిరితో ఆడుతూనూ, ఇందిరతో బయట తిరుగుతూనూ గడిపాడు.

మోహనుడు మైసూరికి వెళ్ళేందుకు ముందు రోజున ఇందిర తన మనస్సులోని సంగతి తండ్రితో చెప్పింది.

మోహనుడు స్నానంచేస్తూండగా ఇందిర తండ్రితో, "రేపు మోహన్ వెడుతున్నారు" అంది.

"ఉఁ. ఇక వరుడిగా ఇక్కడికొస్తారు."

"నాన్నా......?"

"ఏమిటమ్మా?"

"ఆయన వరుడిగా ఇక్కడికి రావటానికి వీల్లేదు నాన్నా."

"అంటే?"

"నేను ఆయన్ను పెళ్ళిచేసుకోలేను"

"ఇందిరా!"

"అవును నాన్నా నన్ను ఒత్తిడి చేయకండి"

"ఇందిరా తెలివిగానే ఉన్నావా అమ్మా ?"

"ఉఁ.....ఇంత తెలివిగా ఎప్పుడూ లేనేమో కూడా."

"అతడికి ఇంత చేసి అంతా వ్యర్థం కావాలా అమ్మా?"

## చతుర

'సంఘం'

ఏపిల్ల అల్లిందో!
ఈ మల్లియల మాల!
భళిభళీ! ఆ బాల
బహు చతుర శీల!

ఒంటరి విరులనే
జంటలుగ చేసింది!
తన మనసు నొక విరుల
వనంలో దాచింది!

జంటలకు మరువమ్మే
చాటుగా నిలిపింది
జడియపని లేదనుచు
చల్లగా తెలిపింది!

ధూళిలో ఈ మాల
దొరలాడనుంచింది!
విరహమెంతటి తీవ్ర
తరమొ చూపించింది!

తావి తగ్గనె లేదు!
వాడి మూరగా లేదు
సరికొత్త వయసుంది!
పరుగెత్తి రమ్మంది!

మామూలు చూపులకు
మల్లె మాలగ తోచు
తలపు చూపులు సాగ
పాము జాబై లేచు!

# వెండిమబ్బు

"ఇప్పుడు గిరికి చేసేదంతా వ్యర్థమనుకుంటూవా నాన్నా?"

"లేదు. కాని, అతడికోసం నేనెంత కష్టపడ్డాను..."

"మామిడిమొక్క నాటేవారు ఆ చెట్టుపళ్లు తామే తినాలని నాటరు నాన్నా. తమ పిల్లలో, మనుమలో ఎవరైనాసరే — తియ్యటిపళ్ళు తినాలన్న నిస్వార్థబుద్ధితో మొక్క నాటుతారు. ఆయన యశస్సు, సంపాదన, కీర్తులలో నేను పాలుపంచుకోకపోతేమాత్రమేం? మరో అమ్మాయి పాలుపంచుకుని సుఖపడుతుంది. నువ్వు చేసింది ఎప్పటికీ వ్యర్థం కాదునాన్నా. మోహనుడు, ఆయన భార్య, పిల్లలు నువ్వు నాటిన మొక్క ఫలాలు తిని సంతోషంగా సుఖంగా ఉంటారు."

"ఇందిరా......"

"నన్ను బలవంతపెట్టకునాన్నా. ఆయన్ను పెళ్ళి చేసుకోవటంవల్ల నేను సుఖంగా ఉండనని అని పిస్తూ ఉంది."

"పోనీ కారణం?"

"మోహనుడు చాలా దుర్బలవ్యక్తి. అలాంటి దౌర్బల్యం నాకు నచ్చదు. ఆయనను చూస్తే నాకు జాలికలుగుతుంది. అందులో ప్రేమ లేనేలేదు. ఉన్నా — అతడిని భర్తగా స్వీకరించగల — మరో రకం ప్రేమ అసలులేదు. ఆయనను చూస్తూంటే నాకు ఎదిగిన గిరిని చూసినట్టు ఉంటుంది."

"తొందరపడకమ్మా. కాస్త ఆలోచించుకో."

"సుమారు మూడునెలలుగా ఆలోచించాను నాన్నా. ఇక నా మనస్సు మారదు."

"కాని......"

"కాని ఏమిటినాన్నా?"

"సుమారు మూడునెలలుగా మోహనుడు ఇక్కడే ఉన్నాడు కాబోయే అల్లుడన్న పేరుతో. ఇంట్లోనేడున్న కాబోయే అల్లుడు—కూతురు—నీ పేరుకు కళంకంరాదా? ఆ విషయం కాస్త ఆలోచించు ఇందిరా."

"నేనుమాత్రం నిష్కళంకను."

"ఆ విషయం నేనూ నమ్ముతానమ్మా. కాని, జనులు, సంఘం, ముందు నిన్ను చేపట్టేవరుడు అందరూ ఒప్పుకోవాలికదమ్మా?"

"ఈ మనుష్యులు, సంఘం వీటి భయం నాకు లేదు నాన్నా. నన్ను సంశయంతో చూసే వ్యక్తిని నేను చేపట్టను. ఇలాగే ఉండిపోతాను."

"నువ్వే మోహన్‌ని పెళ్ళిచేసుకోవాలని కోరావు కదమ్మా. ఇప్పుడు నీ మనస్సు మారటానికి కారణం ఏమిటి?"

"మోహనుడు నా సర్వస్వమనుకున్నకాలమూ లేకపోలేదు. కాని, నా భావనల దర్పణానికి పెద్ద దెబ్బ అకస్మాత్తుగా తగిలింది. అద్దం పగిలి ముక్కలైంది. ఇహ, దాన్ని అతికించటం సాధ్యంకాదు."

"నువ్వు మోహన్‌ని నిరాకరిస్తే సమస్య పరిష్కారంకాలేదు. నీకు నచ్చగల, నిన్ను నమ్మగల యువకుడు దొరకవద్దా ఇందిరా?"

"మనకు మనకు సరిపోలేదు. సంబంధం తప్పిపోయింది. అంటే సరిపోతుంది. నాలుగురోజులు ఈ విషయమే మాట్లాడుతారు. ఐదోరోజున ఇంకో క్రొత్తవిషయం దొరికితే దీన్ని మరిచిపోతారు."

"కాని, నిన్ను చేపట్టేవాడు అన్నీ మరిచి నిన్ను చేసుకోవద్దా?"

"మన ఊరినుండి దూరంగాఉండే, ప్రజం పుకార్లు నమ్మని వ్యక్తి ఎప్పటికీ దొరకనే దొరకడా నాన్నా? అందరూ అంత అల్పబుద్ధి కలవారే అయి ఉంటారా నాన్నా? నా విషయాలేమీ తెలియకుండా నన్ను పెళ్ళి చేసుకోదలచినవాడికికూడా నా అంతట నేను ఈ విషయాలన్నీ చెప్తాను. మనలో తప్పేమైనాఉంటే భయపడాలి. ఇప్పుడు మోహనుడికి పిల్లనిచ్చేవాళ్ళు ఇలాగే వెనుదీస్తారా?"

"అతడు మగవాడు. ఇంకో అమ్మాయితో అతడికి సంబంధముందని తెలిసినా, అతడికి పిల్లనిస్తారు. నువ్వు కాస్త ఆలోచించమ్మా. తొందరపడి ఏ నిశ్చయానికీ రాకు."

"ఈ ఒక్క విషయంలో మాత్రం నన్ను క్షమించు నాన్నా నాకు నచ్చిన, నన్ను నమ్మగల వ్యక్తి దొరికితేనే పెళ్ళి చేసుకుంటాను. లేకపోతే లేదు."

"నా కథ మీ రెండుకు వేసుకోర? బాగా పెద్దదిగా ఉందా?" కావలచిన కథకుడు పత్రికా సంపాదకుణ్ణి అడిగాడు.

"ఔను! చాలా పెద్దదిగాను వెసల్బుగాను మందంగాను ఉంది." సంపాదకుడు రవీనుని సమాధానం చెప్పాడు.

ఎం. భోగయ్య (కాళహస్తి)

రావుగారు చిన్నబోయిన మొహంతో అక్కడ నుండి లేవబోయారు.

ఇందిర హృదయానికి ముల్లు గుచ్చుకున్నట్టయింది.

"నాన్నా, నేను సుఖంగా ఉండటమే నీకు ముఖ్యం కదూ?"

"నవునమ్మా."

"అలాగయితే నువ్వు నొచ్చుకోరాదు."

రావుగారు మాట్లాడలేదు. కొంచెంసేపు ఆగి, అడిగారు.

"మోహన్‌కి ఈ విషయం తెలుసునా?"

"ఊఁ"

"ఏమన్నాడు?"

"ఏమీ అనలేదు. నిరాశ చెందినట్టున్నారు. కొన్ని రోజులు భగ్నప్రేమికునిలాగా ప్రవర్తించవచ్చును. తరువాత సరిపుచ్చుకోగలడని నాకు నమ్మకముంది."

రావుగారు ఇహ అక్కడ నిలువలేకపోయారు.

సాయంకాలం సూర్యుడు పడమటికొండల్లో దాక్కోనటానికి పోతూండగా ఇందిరా, మోహన్ గిరి వాహ్యాళికి వెళ్ళారు.

మోహనుడు చాలా గంభీరంగా ఉన్నాడు ఇందిర కూడా ఎక్కువగా మాట్లాడటంలేదు. గిరి మామూలుగా ఉల్లాసంగానే ఉన్నాడు.

కొంచెందూరం నడిచి, పచ్చటి గడ్డితివాచీమీద ఇద్దరూ కూర్చున్నారు. గిరి దగ్గరగానే బంతితో ఆడుకుంటున్నాడు.

"ఇందిరా, ఇంకోమారు ఆలోచించలేవా?"

"మోహన్, బహుశా ఈ జన్మకిదే మన ఆఖరి కలయిక కావచ్చు ఈ కాస్సేపు సంతోషంగా గడుపుదాం."

"నీ మనస్సు మార్చుకోవడానికి వీలేలేదా?"

"మీకూ, గిరికీ ఏమీ తేడాయే కనిపించటం లేదు నాకు. వయస్సులో, ఆకారంలో తేడా ఉండవచ్చు. గిరిని ఏభావంతో చూస్తున్నానో మిమ్మల్నీ అదే భావనతో చూస్తున్నాను."

మోహన్ మొహం పేలవంగా ఉంది. అతడికి ఉత్సాహం కల్పించడానికి ఇందిర.

"నాకంటే యోగ్యురాలయిన, అందమైన అమ్మాయిని చేపట్టి, సుఖంగా ఉండండి. మీరు ఎక్కడున్నా మీ హితచింతకురాలొకతె ఎప్పుడూ మీ మేలు కోరుతూ ఉంటుంది."

"నువ్వు ఇంత కఠినంగా ఉండగలవని నాకు తెలీదు."

"మీ పెళ్ళిశుభలేఖ పంపండి. నేను ఎక్కడున్నా తప్పక వస్తాను."

"నా కడుపు మండించడానికి నువ్వేమీ రానక్కర్లా"

"మీ ఇష్టం."

"ఆ అన్నట్టు నీ పెళ్ళెప్పుడు ఇందిరా."

"వరుడే నిశ్చయంకాలేదు. ఇహ పెళ్లెక్కడ మోహన్."

"నిశ్చయమయినప్పుడు ఆ భాగ్యశాలి ఎవరో తెలుపు. అతడ్ని అభినందిస్తాను."

"నిజం చెప్పనా మోహన్? నేను ఇహ పెళ్ళే చేసుకోరాదని నిశ్చయించుకున్నాను."

"కారణం?"

"పెళ్ళి, ప్రేమ, సంసారం వీటికి అర్థమేలేదని అనిపిస్తోంది. చిన్నతనంలో నేనో కలకన్నాను. లేతమనస్సు అల్లిన రంగురంగుల కల అది. ఏదో భయంకర హస్తం ఆ కలను తెంచివేసింది."

"ఇక నీ భవిష్యత్తేమిటి ఇందిరా?"

ఇందిర మాట్లాడకుండా సమీపంలోనే ఆడుకుంటున్న గిరిని తమముందున్న విశాలమైన కాఫీతోటనూ మోహన్‌కి చూపించింది.

"గిరి, 'వెండిమబ్బు' ఇవే నీకు ఆసరాలా ఇందిరా?"

"వెండిమబ్బు' ఎక్కడుంది మోహన్? రెండేళ్ళ వెనక జీవితంలో నేను అనుభవిస్తున్న, అనుభవించిన నిర్మలమైన, ముగ్ధ ఆనందం ఇక ఎన్నటికీ పొందలేను. వృద్ధురాలికి యౌవనం ఒక జ్ఞాపకం మాత్రమే. నాకూ అంతే. ఆ చిన్నతనపు ఆనందం ఒక జ్ఞాపకం మాత్రమే. వెండి కరగిపోయింది మోహన్. ఇహ నాకు మిగిలిందల్లా మబ్బు మాత్రమే."

—అంటూ విషాదంతో నవ్వింది ఇందిర. ★

(అయిపోయింది)

# కింగ్ ఆఫ్ కింగ్స్

27-వ పేజీ తరువాయి

విచిత్రానుభూతితో ముఖమంతా అశ్రుమయమైంది.

ఇంతలో ఇంకో ప్రశ్న వేశా రెవరో? అన్నిటికి సమాధానాలు చెప్పాడు. సమయం కోసం నిరీక్షిస్తున్న బరబ్బాసి అనుయాయుల్లో ఉద్రేకం పెచ్చుపెరిగింది. వారిలో ఒకడిలా అరిచాడు:

"మీరేమో చాలా అద్భుతాలు చేస్తారట! ఆ మాటే నిజమైతే, రోమన్‌లను నాశనంచేసి మనకు స్వాతంత్ర్యమిప్పించేందుకు సహాయకులను పంపమని దేవునికి చెప్పండి! చూద్దాం!"

ఈమాటతో రోమన్ సైనికుల్లో కలవరం చెలరేగింది. లూసియస్ వచ్చి బరబ్బాస్ కెదురుగా నిలబడ్డాడు. అలాగే రోమనులందరు శత్రువర్గానికి దగ్గిరగా నిలబడ్డారు. జీసస్ ఇదివరకటి సమాధానాలకన్న కొంచెం హెచ్చుస్వరంలో "దేవుని ఇలాంటివాటితో ప్రలోభపెట్టరాదు. రోమనులు విజేతలు. ఆక్రమణదారులు. వారిని జయించినందువల్ల మీరూ అంతే ఔతారు. వాళ్ళకన్న మీ రేం తక్కువచేసినట్లౌతుంది? వేలాది ఏండ్లుగా మనిషిని మనిషి జయిస్తూనేవున్నాడు...మనం అంతకన్న మంచిపద్ధతి...ప్రేమమయ మార్గం అనుసరించాలి."

ఇంక ప్రశ్నలకోసం జీసస్ ఆగలేదు. "మీరు ఏదృక్పథంలో ఎదటివారిని తూచా లనుకుంటారో అదే దృక్పథంలో ఎదటివాళ్ళుకూడా మిమ్మల్ని పట్టి చూస్తారు. ఎదటివాడి కంటి నలుసును చూపే మీరు మీకంట్లో దూలాలున్న సంగతి గుర్తించరేం? ముందర మీ కనుపొరలు తొలగించుకొని ఆ తర్వాత ఎదటివాడి కంటి నలుసును తీసేందుకు ప్రయత్నించండి."

ప్రార్థనానంతరం జనమంతా వెళ్ళిపోయారు. క్లాడియామాత్రం అలాగే మోకాళ్ళ మీదవంగి కూర్చుని వుంది. లూసియస్ ఆమెను లేవనెత్తి ఇంటికి తీసుకువెళ్ళాడు.

వీళ్ళు వెళ్ళేసమయానికి పిలేట్ హీరాడ్‌లు జూదమాడుతున్నారు. లూసియస్ ముఖంలో కన్పించిన మార్పుకు పిలేట్ దిగ్భ్రమ పొందాడు. "ఆ! ఏం చెప్పాడయ్యా ఆ మనిషి?" లూసియస్ తాపీగా సమాధానమిచ్చాడు.

"ఆమనిషి...ప్రేమ, శాంతి, సౌభ్రాతృత్వాలనుగూర్చి చెప్పాడు." పిలేట్ నవ్వి ఊరుకున్నాడు.

జీసస్ రెండురోజులు నాజరెత్‌లో గడిపి తల్లి మేరీతో, శిష్యుడు పీటర్‌లతో జరూసలెం వెళ్ళాడు.

'గెలిలీ కొండలలో జరిగిన సమావేశంలో జీసస్ చేసిన ప్రసంగం, ప్రతిపాదించిన సిద్ధాంతాలు చాలా మందికి నచ్చలేదు. ఆ నాటి సమావేశానికి అశేషప్రజానీకం హాజరైంది. కాని ఏ కొద్దిమందికో తప్ప మిగిలినవా రెవ్వరికి జీసస్ ప్రబోధించిన సిద్ధాంతాలు అర్థంకాలేదు. రోమన్‌లను తరిమివేసి తమ దేశానికి బానిసత్వంనుండి విముక్తి ప్రసాదించగల శక్తి సంపన్నుని కోసం యూదుజాతి అంతా ఎదురు

## ప్రబోధ తారక

నాగరాజ్

అశాంత జీవిత నిశీధిలో
ప్రబోధ తారక వెలిగింది!!
ప్రాణము లన్నిటి ప్రాణం తానై
జీవాలన్నిటి జ్యోతిరూపమై
సృష్టి ధర్మమునె సవాలు చేస్తూ
ప్రబోధతారక వెలిగింది!!
కనబడు రూపం ఒకటైతే
కలిగిన రూపం వేరొకటై
కల నిజములకు కలయిక తానని
ప్రబోధతారక వెలిగింది!!
దోషదూషణల ధర్మమె తానని
కాని పనులకు కూడలియన్నా
కన్నులార్పకే కలవరమందే
అశాంత జీవిత నిశీధిలో ||ప్ర||
మృత్యుదేవతకు మారురూపమై
దినసంధ్యలకు దివ్యదర్శనమై
తమసోమాజ్యోతిర్గమయంటూ
కలకాలమును కలవరింపగ ||ప్ర||






# కింగ్ ఆఫ్ కింగ్స్

చూస్తోంది. జీసస్‌నే ఆ మహావీరుడుగా భావించి ఆయన ఏదో కొత్త మార్గాలు ప్రబోధించి రోమనులను అణచే పద్ధతులు బోధిస్తాడేమో అని ఆశపడ్డారు. ఉత్సాహంతో ఉరకలెత్తారు. ప్రవక్త అనేవాడు డేవిడ్, గిడియోన్, ఎలిజాల్లాగా కత్తిపట్టి రోమనులను పారద్రోలే వాళ్ళే కావాలని బరబ్బాస్ లాంటి విప్లవకారులకేగాక, జీసస్ అనుయాయులకు కూడా కొందరికి ఓ నమ్మకం ఏర్పడింది. అందువల్లే జీసస్ ప్రబోధించిన ప్రేమ, ఔదార్యం, మానవ సేవలాంటివి విచిత్రము, వింత అయిన పద్ధతులుగా వాళ్ళకు కన్పించాయి. జనానికి బరబ్బాస్ పనుల పట్లే మొగ్గు ఎక్కువగా కన్పించింది.

ఐనా జీసస్ నిస్పృహ లేకుండా, భగవత్కార్యంగా తన ప్రబోధాన్ని నాజరత్ వాడవాడలా విన్పిస్తుంటే, యూదుల విమోచనమే ప్రధానంగా, స్వాతంత్ర్యం కోసం పోరాటంగా బరబ్బాస్ ఆయుధాలను సమకూర్చుకుని పొంచి కాపున్న బెబ్బులిలాగా సమయం కోసం ఎదురుచూస్తున్నాడు.

జీసస్‌ను ఎలాగైనా తమ వైపుకు త్రిప్పుకోవాలని శిష్యుడుగా చేరిన జూడస్ ఇప్పుడు జీసస్ ఆంతరంగికుల్లో ఒకడైపోయాడు జీసస్ ప్రబోధించే అహింసా సిద్ధాంతం అతన్ని బాగా కదలించివేసింది. జూడస్ ఒకనాడు బరబ్బాస్ దగ్గరకు వచ్చాడు. జీసస్‌తో కలియమని బ్రతిమిలాడడు. అందుకు బరబ్బాస్ నీళ్ళు నిప్పు కలవ్వని సమాధానం చెప్పాడు.

శాబత్ పండుగ మరునటిదినం జీసస్ తన శిష్యులతో బహిరంగ సమావేశం జరుపబోతున్నాడని, ఆ సమావేశం కూడా పవిత్రాలయం దగ్గిర జరుగుతుందనీ బరబ్బాస్ సైనికులు జీసస్‌కు అండగా నిలిచి, ప్రతి ఘటనా రాహిత్యంలో గల శక్తిని ప్రకటించమనీ, జీసస్ తను రాజు కావాలనుకోటం లేదనీ చెప్పినా ప్రజలతనిని రాజాధిరాజుగా పూజిస్తారు గనుక ప్రజాభిప్రాయానికి తలొగ్గక తప్పదనీ, ఈ ప్రయత్నంలో అహింసాపూర్వకంగా జీసస్‌తో సహకరించమనీ ఎన్నో విధాల జూడాస్ బరబ్బాస్‌ను బ్రతిమిలాడాడు రక్తపుబొట్టు చిందకుండా యూదులకు విముక్తి కల్పించగల్గితే, నేనే స్వయంగా ఆయన్ను రాజును చేస్తానని బరబ్బాస్ జూడస్‌ను పంపించివేశాడు అతడలా వెళ్ళగానే తన దళవాయితో బరబ్బాస్ "జూడస్ కలలు కంటున్నాడు. ఇలాంటి వాళ్ళంతా తెలివితక్కువవాళ్ళే మనం ఎదురుచూస్తున్న సమయం దొరికింది వీళ్ళను చక్కగా ఉపయోగించుకుందాం." ఆ సమావేశ సమయంలో ఏయే దళాలు ఏయే ప్రక్కల రోమనులను ఎదుర్కోవాలో నిర్ణయించుకున్నారు.

ఐతే వీళ్ళ రహస్యాలన్నీ పసిగట్టి సమయం కోసం చూస్తున్న లూసియస్ అనేబ ఉక్కుపిడుగున్నాడన్న సంగతి, సీజర్ ఆజ్ఞాతిక్రమణం చేస్తే వారిపట్ల ఆతనిలో కరకుతనం తప్ప కనికరం గోచరించదన్న విషయం ఆవేశప్రాధాన్యులు, పరిమిత పరిజ్ఞానయుతులు, అనభ్యస్త శస్త్రోపజీవులు, ఆ విప్లవకారులు మర్చిపోయారు.

—ఇంకా ఉంది.

# హత్యకి కొత్తచెప్పులు

25-వ పేజీ తరువాయి

గుడ్‌విన్ తల్లిది.

పక్క ఊరులో వేక్‌ఫీల్డ్‌లో ఒక రైలుస్టేషను ఉంది. దానిదగ్గర పొదలలో నెత్తురుతో తడిసిన షర్టు ఒకటి దొరికింది. బోస్టన్ వెళ్ళేబండిలో సోమవారం పొద్దున ఒక పొడుగాటివ్యక్తి ఎక్కడం స్టేషనులోవారు చూశారు.

33—సం. వయస్సుగల జార్జి ఛాంపియన్ పోలీసులకు దొరికిపోయాడుగాని అతను హత్యనేరానికి ఒప్పుకోలేదు. ఆదివారం గుడ్‌విన్‌ల ఇంటికి వెళ్ళి తిరిగివచ్చేశానని చెప్పాడు. చిన్నపుస్తకం సంగతి తనకేమీ తెలియదన్నాడు.

నెత్తురు మరకల షర్టుసంగతి? అవును అది తనదే. రైలుబండికోసం కాచుకుని ఉండగా ముక్కునుంచి రక్తంకారింది. అందుకని దానిని అవతల పారేశాడు, అంతే.

ఛాంపియన్‌ని జెయిలుకి పంపించారు. అప్పటికి కాప్టెన్ డూగాన్ ఇంకా సెలవుమీదనే ఉన్నాడు. వచ్చినప్పటినుంచీ ఈ హత్యతప్పితే వేరే విషయమే మాట్లాడేవారుకాదు ఊరిప్రజలు. అతనికి ఒక చిన్నవిషయం తెలిసింది. శనివారంనాడు (హత్యకుముందు) ఫ్రెడ్‌బెర్‌ట్‌ష్ ఒకజత బూట్లు కొన్నాడట.

జెయిలులో ఛాంపియన్ తనదుస్తులేమీ మార్చనన్నాడుట. కొత్తబూట్లు వేసుకుని ఉండటం అధికారులు గమనించారు. డుగాన్‌కి ఈ సంగతి తెలిసింది. బలవంతాన ఆ బూట్లను తీసుకుని బెర్‌ట్‌ష్‌కి పాదరక్షలు అమ్మిన అంగడి అతనికి వాటిని చూపించారు. అతను, అవి తాను బెర్‌ట్‌ష్‌కి అమ్మినవేనని నిర్ధారణ చేశాడు.

## నేరారోపణ

ప్రాసిక్యూషన్‌వారు ఛాంపియన్ ఇంటిలోని నలుగురినీ చంపి తగులబెట్టాడని ఆరోపించారు. కాని బెర్‌ట్‌ష్ కొత్తబూట్లు దొంగిలించకుండా ఉండలేకపోయాడు.

'జూరీ' జార్జి ఛాంపియన్ హత్యానేరంచేసినట్లు నిశ్చయించింది. మెయిన్ రాష్ట్రంలో మరణశిక్షలేదు కనుక అతనికి యావజ్జీవ కారాగృహనివాసం ఏర్పరచారు.

ఇదంతా జరిగి 62 సంవత్సరాలు కావస్తోంది. అసలు కాప్టెన్ జోడూగాన్‌కి 'ప్రశాంతంగా' ఉండే సెలవు దొరికిందో లేదో ఎవరికి తెలుసు? కనీ కనీసం 1901లో ఏ హత్యా జరగలేదు! ★

---

# వాయిదా

24-వ పేజీ తరువాయి

న్నారు. గిరిజ, వాళ్ళ అన్నయ్య కూడ కాలేజీటీములో ఆడుతుండటంచేత వసంతను, శ్యామలనుకూడ బలవంతంచేసి తీసుకువచ్చింది ఆట చూడడానికి.

గిరిజ అన్న కుశాలరావు వసంతకు క్లాసుమేట్.

'మగవాళ్ళు ఆడుకునే ఆట మనం చూసేదేమిటి 'నేను రాను' అన్నది వసంత.

'ఫుట్‌బాల్ ఆడవాళ్ళుమాత్రం ఆడకూడదని ఆంక్ష ఏమీ లేదుగా— అమ్మమ్మకబుర్లు చెప్పక, త్వరగా బయలుదేరు' అని గిరిజ నచ్చచెప్పి తీసుకు వచ్చింది.

పీళ్ళేగాకుండ ఇంకా పది, పదిహేనుమంది విద్యార్థినులు కూడ అక్కడికి రావడంతో వసంతకు కొంత ధైర్యం వచ్చింది.

దభీమని మీదపడిన బంతికి 'అసంకల్పప్రతీకారచర్యగా' వసంత ఎగిరిపడి గావుకేక పెట్టింది. గిరిజ, శ్యామల, వసంతను చెరో రెక్క పట్టుకుని భయం పోగొట్టారు.

అంత పరధ్యానంగా ఉండవద్దని సలహా ఇచ్చారు. వసంతకు అభిమానం ముంచుకువచ్చింది. పక్కనున్నవాళ్ళు పళ్ళికిలిస్తుంటే ఆమెకు వళ్ళు మండిపోయింది.

'అయినా ఇంతమంది నిలబడి చూస్తుంటే ఆ బంతి తనమీదే పడాలా! వెధవది ....'

వసంత గిరిజవేపు చూసింది. ఆక్షణంలో గిరిజ మొహం చాటంత చేసుకుని ఆట చూడటంలో లీనమయిపోయి, కింద కాలితో ముందు కూచున్న ఒక అర్భకుణ్ణి తన్నేస్తోంది.

'అదేమిటే! ఆ చిన్నపిల్లాణ్ణి అలా తన్నేస్తున్నావ్! వాడేం బంతి అనుకున్నావా!' అన్నది వసంత.

'అబ్బ! అదిగాదే! మా అన్నయ్యచూడు...... ఆ.. ఆ!..... ఈసారి గోలు తప్పదు. అరె. .... వాడొకడు కొంగలాగ. .వాడు అడ్డురాకుండ ఉంటేనా ఈపాటికి గోలు అయిపోయేది

'ఏధ్య నీ బాధ ఏమిటి! నోరు మూసుకుని చూడలేవూ! మగాళ్ళతో సమానంగా అరుపులేమిటే' అన్నది వసంత.

గిరిజలోని ఉత్సాహమంతా దిగజారిపోయి— వెనక కర్ణుడు, శల్యుణ్ణి చూసినంత కోపంగా చూసింది.

కాని ఇంతలోకే ఆటగాళ్ళ కేకలు వారికి దగ్గరగా వినపడుతుండటంచేత గిరిజదృష్టి అటువేపు మళ్ళింది.

అప్పటికి ఆట మొదలుపెట్టి అరగంటయినా, ఒక గోలుకూడా అవలేదు. ఎప్పటికప్పుడు గోలు అయినట్టే గోలపెట్టడం, కొంచెంలో తప్పిపోవడం—జరుగుతున్నది.

ఈసారి ఎలాగంయితేనేం కుశాలరావు బంతిని కార్నరుదాకా తీసుకువచ్చాడు.

ఈసారి తప్పకుండా గోలు అవుతుందని భాష్యం చెపుతున్నారు కొందరు.

'ఇదుగో—చూస్కో మరి! గోలు కొట్టబోతున్నాను' అని గర్వంగా ఛాతీ విరుచుకుని నాలుగువేపులా చూపు సారించిన కుశాలరావు కళ్ళకు అమందానందకరమయిన—నేత్రానందమయిన దృశ్యం అనగా వసంత—స్వీట్—వసంత పదిగజాల దూరంలో దృగ్గోచరమయింది. తన చెలికత్తెలతో వచ్చిన రాకుమార్తెలా ఉన్నది. అటూ, ఇటూ గిరిజ, శ్యామలా— మధ్య నిలబడిన వసంతను చూస్తుంటే—గ్రీకు(?) పురాణగాథల్లో—అభాగ్యుడయిన హీరో సింహాలతో పోట్లాడుతుంటే అతనికి హృదయం అర్పించిన రాకుమారి పై అంతస్తులోంచి ఆ దృశ్యం చూస్తున్నట్టుగా—ఇంకా ఇంకాగా అనిపించింది కుశాలరావుకు. అయితే ఇందాకటినుంచి తన ఆట వసంత చూస్తోందన్నమాటేగా!

ఉష్షార్! ఈ దెబ్బతో గోలే! ఈ ఛాన్సు పోతే మళ్ళీరాదు. అయితే కార్నర్ బాల్‌తోనే గోలు అవ్వాలి. ఈ దెబ్బను కాసుకోవడం గోలుకీపరుకు సాధ్యం కాదు

'ఒరే కుశాల్రావ్ ఏమిటా పరధ్యాన్నం. కానీ' అనిఅత నిదగ్గరగావచ్చి హెచ్చరించి వెనక్కి వెళ్ళిపోయాడు సుబ్బారావు.

తృళ్ళిపడి—ఒక్కసారి క్రీగంట వసంతవేపు చూచినవాడయి అత్యంతానందోత్సాహాలతో ఒళ్ళు పులకరించగా—ముందున్న బంతి అల్లకల్లోలమయ్యేలా ఎగిరి బలంకొద్దీ తన్నాడు కుశాలరావు.

దీర్ఘచతురస్రాకారపు ప్రేక్షకులు హాహాకారాలు చేశారు. ఎందుచేతనంటే అంతవరకు తప్పకుండా గోలవుతుందనుకుని ఉత్సాహపడుతున్న ప్రేక్షకులు కుశాలరావు తన్నిన బంతి గోలువేపు వెళ్ళడానికి బదులుగా గగనమార్గంగా ప్రయాణాని కుపక్రమించడమే!!

"అదేంపనిరా చవటా" అన్నాడు సుబ్బారావు కసిగా.

'వసంత' అన్నాడు కుశాలరావు అదోలా మొహం పెట్టి.

'నీ బొంద! ఆటంతా పాడుచేసి ఇంకా ఏదో పలవరింతకూడాను.'

'పలవరింతకాదురా సుబ్బాష్! రియల్లీ వసంత—ఆ! ఆ!! వసంత! అరె! అరె!" అతను అలా డైలాగులు చెబుతుండగానే, అతనిచేత తన్నబడిన బంతి వసంతనెత్తిన పడి—అక్కడినించి లేచి అయిదు తలల కవతలగాఉన్న సోమయాజులుమేష్టారి బట్టతలను తడిమి, దరిమిలా ఎగిరి కిందపడే పోయింది.

కావాలనీ, తనను అవమానించాలని, వేళాకోళం చేయాలనీ బంతి తనమీద పడేలాగ తన్నాడు కుశాలరావుఅని అపోహపడింది వసంత. ఉక్రోషం—కోపం—దుఃఖం—అభిమానం—ఇవన్నీ ఒక్కసారిగా ఆమె హృదయభాండాన్ని నింపివేసినయి.

గిరిజ ఎంత పిలిచినా వినిపించుకోకుండ— కనీసం వెనుదిరిగి చూడకుండ ఇంటికి వెళ్ళిపోయింది వసంత.

వసంత మళ్ళీ కనిపించకపోయినా ఉన్నదనే భావనతోటే కుశాలరావు మిగతా అరగంటకూడ ఆట సాగించి వరసగా రెండుగోల్సు చేశాడు తర్వాత.

# వాయిదా

ఎంత వెదికినా వసంత కనపడలేదు. గిరిజ, శ్యామల మాత్రం పళ్ళికిలించి చూస్తున్నారుగాని, వసంతమాత్రం కనపడటంలేదతనికి. వెనకాల ఎక్కడయినా నిలబడి, తన ఆట గొప్పతనాన్ని తిలకించుచుండవచ్చుననుకున్నాడు కుశాలరావు.

వసంతకు తనలోఉన్న గొప్పతనాన్ని చూపించడానికి ఈవిధంగా అవకాశం లభించినందుకు ఫుట్‌బాల్ ఆటకు—ఆట చూడడానికి వసంతను వప్పించి తీసుకువచ్చిన తన అనుంగుసోదరి గిరిజకు అభివందనాలు అంతర్గతంగా తెలుపుకున్నాడు.

క్లాసులో ఎన్నోసార్లు తన ఆధిక్యత నిరూపించుకోవటానికి ప్రయత్నంచేసినా, అది సాధ్యపడలేదు కుశాలరావుకు.

ఒకసారి ఇంగ్లీషు లెక్చరరుకు సరదాపుట్టి, జనరల్ నాలెడ్జి అనగా ప్రపంచజ్ఞానం అనబడే విషయంమీద ప్రశ్నలు అడగడం మొదలుపెట్టాడు.

"సూర్యుడు భూమధ్యరేఖమీద సంవత్సరానికి ఎన్నిసార్లు ఉంటాడు. ప్రపంచములో మహా నగరాలలో మొదటి మూడు ఏవి? మార్కోపోలో ఎవరు?" ఇత్యాది ప్రశ్నలు.

సరయిన సమాధానం చెప్పిన విద్యార్థులు సగర్వంగా చూస్తున్నారు. తప్పుగా, తెలివితక్కువగా సమాధానాలు చెప్పినవాళ్ళని మిగతావాళ్ళు ఎగతాళి చేస్తున్నారు. అందులో ఇంగ్లీషు లెక్చరర్‌కూడ భాగం పంచుకుంటున్నాడు.

ఆయన అడిగిన ఒక ప్రశ్నకు వసంతకూడ సరయిన సమాధానం చెప్పింది.

తనవంతు ఎప్పుడు వస్తుందా, ఎప్పుడు సమాధానం చెబుదామా అని ఉవ్విళ్ళూరుతున్న కుశాలరావువంతు రానేవచ్చింది.

'ఇంగ్లండ్ ఎక్కడ ఉన్నది' అని ప్రశ్న.

'లండనులో ఉన్నది సార్!' కుశాలరావు సమాధానం.

క్లాసంతా గొల్లుమన్నది. తనతప్పు తెలుసుకున్నాడు కుశాలరావు. నాలిక కొరుక్కుని బోలెడు సిగ్గుపడ్డాడు. అన్నిటికంటె బాధాకరమయిన సంగతి వసంత నవ్వడం.

ఇంగ్లీషులెక్చరరుమీద చెప్పరానికోపం వచ్చింది. తనను బోల్తాకొట్టించడానికే ఆప్రశ్నవేసి ఉంటాడు. తనను ఫూలుని చేశాడు. తను ప్రేమిస్తున్న వసంతముందు చులకనచేసి అవమానించాడు. ఇటువంటి పాపం ఊరికినే పోదని బామ్మ చాలామాట్లన్నది. ఆయనకుమాత్రం ఆడపిల్లలు లేరా! వాళ్ళకు పెళ్ళిడురాకపోతుందా! వాళ్ళు ఎవరి ప్రేమలోనైనా పడకపోతారా! తనను అవమానించిన ఉసురు తగలకుండా పోతుందా!—దరిమిలా కుశాలరావు సమాధానపడ్డాడు.

ఆనాటినుంచి ఎంతో ప్రయత్నిస్తున్నాడు, వసంతముందు తన ప్రత్యేకత చూపించుకోవడానికి. కాని అట్టర్ ఫెయిల్యూరే!

నాటికి ఈనాడు సదవకాశం లభించింది. తన ప్రజ్ఞ చూపించి—మళ్ళీ మాట్లాడితే గ్రౌండంతా తానే అయి — విజృంభించి — వీర విహారంచేసి

రెండు గోల్సుచేసి, అవతలవాళ్ళ ముఖాన నెత్తురు చుక్క లేకుండా చేసి, తన టీముకు ఘన విజయమూ—తద్వారా కీర్తిప్రతిష్ఠ లార్జించిపెట్టాడు!

దీనికి కారణం—తన శక్తిసామర్థ్యాలే కాకుండ వసంతకూడ అక్కడ నిలబడటం తనకు ఎంతో హుషారు ఇచ్చింది. టపీటపీమని రెండు గోలులు చేసిపారేశాడు. గోలువేసినప్పుడల్లా మిన్నంటిన హర్షధ్వానాలమధ్య వసంతను చూద్దామని. ప్రయత్నం చేశాడుగాని, ఎక్కడా కనిపించందే! ఆఁ! వెనకాల ఎక్కడో నక్కిచూస్తూ ఉండిఉంటుంది.

ఈ దెబ్బతో ధైర్యంగా కలుసుకుని తన గొప్ప చెప్పుకోవచ్చు. మాటలు కలుపుకోవచ్చు. ఆమె నాయడల సానుభూతి చూపించవచ్చు.

'రేపే వాళ్ళింటికి వెళ్ళేదనుగాక' అనుకున్నాడు కుశాలరావు.

ఆ ఉత్సాహంతోనే ఇంటికివచ్చి చెల్లెల్ని అడిగాడు. 'చూశావా మన తడాఖా!' అని.

'ఆ! చూశానుగాని, ఒళ్ళు దగ్గరపెట్టుకుని ఆడితే ఇంకా ఎక్కువ గోల్సు అయ్యేవి!' అన్నది గిరిజ.

'అసలు మీ ఆడవాళ్ళకు తృప్తి అనేది ఉన్నదా అని!......గెలవడం ప్రధానం—అయితే నువ్వు ఒక్కదానివే వచ్చావేంటి' అని అడిగాడు కుశాలరావు.

'ఒక్కదాన్ని ఏం ఖర్మ! చాలామంది వచ్చారు. గ్రౌండుకు నాలుగువేపులా ఉన్నారు' అంది గిరిజ అన్నను ఒక మాదిరిగా ఏడిపిస్తూ.

'ఇదసలే పెంకెరకం. అడిగిందానికి సూటిగా సమాధానం చెప్పదు. దీన్నడిగి ఉపయోగం లేదని ఊరుకున్నాడు.

ప్రేమలోపడిన పడుచువాళ్ళ సంగతే అంతని వేరతో అయిన ప్రాశాడు పాటుగా.

వసంతను ప్రేమించాననుకుని మురిసిపోయి, సతమతమవడం కుశాలరావుకు అలవాటయిపోయింది. ఇద్దరూ ఎదుటపడి ఒక మాట పలుకూ ఆడకపోయినా, ఆమె ఇష్టాయిష్టాలు, అభిరుచులు, అభిప్రాయాలూ, ఆదర్శాలు వగైరా లేమీ తెలుసుకోకుండానే వసంతను ప్రేమించాడు.

ఆమెతో హృదయం విప్పి (కనీసం నోరు విప్పి అయినానరే ప్రస్తుతానికి) మాట్లాడటానికి అవకాశం దొరక్క గొప్పగా బాధపడిపోతున్నాడు ఇంతకాలంనుంచీ!

వసంతతండ్రి చాల సాధుస్వభావం గలవాడని వినికిడి. అందుచేత వాళ్ళ ఇంటికి వెళ్ళినంతమాత్రం చేత ప్రమాదమేమీ జరక్కపోవచ్చుననే ధైర్యం కుశాలరావుకు లేకపోలేదు. కాని, దానికి తగిన తెగింపు పోరన మాత్రమే కొరతగా ఉన్నాయి.

వసంతకాలం ఎంత హాయిగా ఉంటుందో వసంత కూడ అంత అందంగా, బాగా ఉంటుంది. చూడడానికి రెండు కళ్ళు చాలవు. అందుకే కుశాలరావుకి నాలుగుకళ్ళు అయినయి.

ఎవ్వరూ ప్రేమించకుండా ముందుగా తనే ప్రేమించాడు వసంతను. కనుక కథలో హీరో హీరోయినూ తప్ప, విలను ఉండటానికి అవకాశం లేదు.

సుబ్బారావుకుమాత్రం ఈ విషయం తెలుసు. వాడు మంచివాడేగాని, ఈర్ష్య ఎక్కువ. ఎదుటవాడు మంచిపనిచేస్తే మెచ్చుకునే బుద్ధి లేదు. పయిగా వచ్చుకబుర్లు చెబుతాడు. గుండె అవిసిపోయే కబుర్లు చెబుతాడు.

ఎవరో ఒక స్టూడెంటు ఇలాగే ఎదురింటి మాష్టారి అమ్మాయిని ప్రేమించి—ఉత్తరాలు గట్రా రాసుకుని ఒకరికొకరు పలుకరించుకుని—త్వరలో పెళ్ళి చేసుకుందామనుకుని చేతులో చెయ్యి వేసుకుని ప్రమాణాలు చేసుకున్నాక—కొంత కాలానికి ఈ సంగతి ఆ పిల్లతండ్రికి తెలిసి నిలువునా మండిపోయి, కూతుర్ని కూకలేసి, ఎదురింటి గదిలో ప్రవేశించి స్టూడెంటును అనవలసిన మాటలు నాలుగూ దులిపేసి, బుద్ధిగా లేకపోతే మీ నాన్నకు ఈ సంగతి తెలియపర్చి, నిన్ను ఏంచేస్తానో చూడు—అని బెదిరించి వెళ్ళిపోయాడుట.

మరుసటిరోజు పొద్దున తొమ్మిది గంటలవేళ స్టూడెంటు ఉన్న గదితలుపులు బద్దలుకొట్టి పలుగురూ ప్రవేశించి దూలానికి వేళ్ళాడుతున్న అతని బాడీని కిందకుదించి ఆత్మహత్య చేసుకున్నాడని పంచాయతీ చేశారుట.

"ఉండండి! మా అమ్మాయి కాసేపు సంగీతం పాడుతుంది." విందుకు వచ్చిన బంధువులతో సుందరమ్మగారు అన్నారు.

"మంచిదే. కాని ఇప్పుడు కాసేపు విశ్రాంతి తీసుకుంటే బావుంటుందేమో" చుట్టాలు నీళ్లు నమిలారు.

కాశేశ్వరరావు (మదనపల్లి)

అన్నీ ఇలాంటి కబుర్లే చెబుతూ ఉంటాడు సుబ్బారావు. ఆడపిల్లల్ని ప్రేమించడం చాల ప్రమాదకరంట!

ఆడపిల్లల్ని గాకపోతే ఇంకెవర్ని ప్రేమించాలో మరి!

అందుచేత ఏమయినాగాని రేపు ఉదయం వాళ్ళింటికి వెళ్ళి, ఆమె పరిచయభాగ్యం లభింపజేసుకోవాలి. అనుకున్నపని నెరవేరితే ఆంజనేయస్వామి ఎంత అడిగితే అంత ఇవ్వాలి. ఏమీ అడక్కపోతే అయిదు కొబ్బరికాయలయినా కొట్టాలి.

ఆ సంకల్పంతో తెల్లవార్లు నిద్రపట్టక తెల్లవారుఝామున నాలుగున్నరకే లేచి కాలకృత్యాలు తీర్చుకుంటుంటే బామ్మ లేచి మేలుకొలుపులుపాడటం మొదలు పెట్టింది.

గిరిజ నిద్రమత్తులోనే బామ్మను విసుక్కుంటున్నది.

అయిదుగంటలకే అన్నీ పూర్తిచేసుకుని గదిలో కూర్చున్నాడు, తూర్పువేపుచూస్తూ సూర్యుడికోసం.

నిమిష మొక యుగం. మహాయుగంగా గడుస్తున్నది. బామ్మ మేలుకొలుపు పాట ఇంకా వినవడుతూనే ఉంది.

కిటికీలోనుండి వచ్చే చల్లనిగాలి శరీరానికి చక్కలిగింతలు పెడుతున్నది. ఆనందపారవశ్యంలో తనువు తేలిపోతున్నది.

'నీవేనా నను పిలచినది—నీవేనా నను తలచినది—నీవేనా నా మదిలో నిలచి హృదయము కలవరపరచినది'......తీయగా, కమ్మగా పాడుకుంటూ గేటు తెరుచుకుని క్రోటన్సుమధ్యగా నడిచివెళ్ళి మెట్లెక్కి వరండాలో నిలబడిన కుశాలరావుకు కమనీయమయిన దృశ్యం కళ్ళబడింది.

అతనికోసమే ఎదురుచూస్తున్నట్టుగా వసంత సీతాకోకచిలుకలాగ అలంకరించుకుని సోఫాలో కూర్చుంది.

అతన్ని చూడగానే లేచి దగ్గరగావచ్చి చిరునవ్వుతో స్వాగతం పాడింది. విశాలమయిన హృదయం మీద వాలిపోయింది. వాలిపోయిందేమోననికూడ అనుమానం.

వసంత తలను ప్రేమగా నిమిరి, ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

'పైకి వెళ్దాం!' అంది. ఇద్దరూ చేయీ చేయీ కలుపుకుని మెలికలు తిరిగిన మెట్లమీదగా మేడమీదకు వెళ్ళారు.

విశాలమయిన గది. అందులో అలంకరణ అంతా అత్యంతాకర్షణీయంగా ఉన్నది.

'వసంతా—నా హృదయానికి చక్కలిగింతా—నీమీదే నా వలపంతా!' కవిహృదయం ఉప్పెనలా పొంగి ప్రవాహంగా కుశాలరావు నోటినుండి ప్రవహించసాగింది.

కిలకిలా నవ్వింది వసంత. ఆనవ్వులో ఏమి హాయి! ఎన్నో వీణలు వరుసగా అమర్చి, తీగలన్నీ ఒక్కసారిగా మీటితే ఎంతటి మధురమయిన ధ్వని కలుగుతుందో ఊహించడం కష్టం! శుకపికశారికలు సంగీతం పాడినట్లున్నదా కిలకిలారావం!

వయ్యారంగా రెండడుగులు వెనక్కువేసి నిలుచుంది వసంత.

ఆహా ఏమి ఆ నడకలో వయ్యారం! 'ప్రవరుని చూచిన వరూధిని'—చూచి ఝళం ఝళత్కటక సూచితవేగ పదారవిందయై లేచి''నట్లుగా ఉన్నది.

కుశాలరావు జన్మ ధన్యతపొందినంతగా పరవశమయిపోయి వసంతను పట్టుకుందామని చేతులు ముందుకు చాపాడు.

మధురానుభూతి కరిగిపోయింది. బల్లమీదనున్న గాజుగ్లాను ఎగిరి కిందపడి ముక్కలు ముక్కలుగా మారి ఊరుకుంది.

'అబ్బబ్బబ్బ'.....బామ్మ, గిరిజ కలిసికట్టుగా లోపలినుంచి యుగళగీతం పాడుకుంటూ వచ్చారు.

'ఏమిట్రా! పొద్దున్నే భజన మొదలుపెట్టావ్' అన్నది గిరిజ నిద్రకళ్ళు నలుపుకుంటూ.

పొరపాటు గుర్తించాడు కుశాలరావు.

'ఏమీలేదు చెల్లాయ్! మరే—చెయ్యి తగిలి కిందపడి పగిలిపోయింది గ్లాసు' అన్నాడు.

పాడుగ్లాసు అక్కడ లేకున్నా బాగుండేది. ఎటువంటి కల కరిగిపోయింది అని ముక్కచెక్కలయిన గ్లాసును తిట్టుకున్నాడు.




# వాయిదా

ప్రేమవల్ల మతికూడ చెడిపోతుంది కాబోలు. కాకపోతే ఎన్నడూలేనిది ఇవ్వాళ తెల్లవారు ఝామునే లేవడమేమిటి. తీయతీయని కలలు కనటమేమిటి! వేకువజామున వచ్చిన కలలు—బామ్మ చెప్పినట్లుగా ఫలించుగాక! ఆనక తను వెళ్ళగానే వసంత అలాగే స్వాగతమిచ్చి తనకు హృదయా న్నర్పిస్తే—ఒలింపిక్ గేమ్సులో పాతిక గోల్సు మెడల్సు సంపాదించినంత అదృష్టం! ఫుట్‌బాల్ టీముకు కెప్టెన్‌గా అయినంత ఆనందం!! ఇంటర్ కాలేజీ స్పోర్ట్సులో తమ జట్టు ఒకే ఒక గోలు తేడాతో గెలిచినంత సంతోషం. ఇంకా ఎంతో ఉల్లాసం!!

'పరధ్యాన్నం స్వాములవారూ కాఫీ తాగు చల్లారిపోతున్నది' అన్నది గిరిజ—అంతకుముందు రెండు నిమిషాలనుంచి పరకాయించి చూస్తున్న కారణం చేత.

ఉలిక్కిపడి గ్లాసు అందుకున్నాడు కుశాలరావు.

'బామ్మ మిరపకాయలు తీసుకువస్తున్నది' అర్థంకాకుండా అన్నది గిరిజ.

'ఎందుకు!' ఆముదంతాగిన మొహం పెట్టాడు కుశాలరావు.

'దిష్టి తీయడానికి'

'ఎవరికి'

'నీకు'

'నాకా!' ఆశ్చర్యపోయాడు కుశాలరావు.

'నిన్నటినుంచీ చూస్తున్నదిట నీ పిచ్చివాలకం. ఎవరికళ్ళో నీమీదపడి ఇలా అయిపోయావని బామ్మ అనుమానం' అన్నది గిరిజ.

'నిజంగా చెల్లాయ్! మరేం, బామ్మ మేధస్సు చాల మెచ్చుకోతగ్గది ...... కాదంటావా......నువ్వే చెప్పు!'

ఇంతలో రెండు గుప్పెళ్ళ ఎండుమిరపకాయలు తీసుకువచ్చి కుశాలరావుచుట్టూ ఎడాపెడా తిప్పి తీసుకుపోయి కుంపటినిప్పుల్లో పోసి, మళ్ళావచ్చి కళ్ళూ కాళ్ళూ తడి చేత్తో తుడిచి 'ఏం నాయనా! ఒళ్ళు నెప్పులు కూడా ఉన్నాయా!' అని అడిగింది మనమణ్ణి.

'ఏంలేదు బామ్మా! నువ్వేం కంగారుపడకు!' అని ధైర్యం చెప్పాడు.

'ఏమిటో పిచ్చి నన్నాసి' అనుకుని వెళ్ళిపోతున్న బామ్మగారికి ఎదురుగా మెట్లెక్కి లోపలికివస్తున్న ఒక ఆగంతకుని చూసి నెత్తిమీద ఆచ్ఛాదనం కొంచెం ముందుకు లాక్కుని నిలబడిపోయింది.

'కుశాలరావు మీ అబ్బాయేనాండి' అని అడిగాడాయన.

'కాదునాయనా! నా మనవడు' అని సగర్వంగా చెప్పుకున్నది. 'మీ మనమణ్ణి కొంచెం పళ్ళు దగ్గర పెట్టుకుని మసలమనండి.'

'ఏమిటి నాయనా! ఏం జరిగింది .....అసలు మీరెవరు! పొద్దున్నే ఈ అఘాయిత్య మేమిటి!' బామ్మగారు ప్రశ్నలవర్షం కురిపించింది.

'మీకు పెళ్ళికావలసిన పిల్ల ఉన్నది గదా. కాలేజీలో చదువుతున్నదిగదా! అందరు పిల్లలూ అలాంటివారే నన్నజ్ఞానం ఉండక్కర్లే!'

'కొంచెం తెలిసేట్టు చెప్పండి ఏం జరిగింది!'

'మా అమ్మాయి నిన్న సరదాగా ఫుట్‌బాలాట చూడటానికి వెళ్ళి, జనంలో నిలబడితే కావాలని మరీ నెత్తినపడేట్టు బంతి తన్నాట్ట మీ మనవడు. అంత పొగరా!'

లోపలనుంచి ఈ సంభాషణలు వింటున్న కుశాలరావుకు ఎదురుగా గిరిజ రెండుగా కనపడింది. అంతలోకి పౌరుషం వచ్చింది. ఎవడో మాటలు మహా జోరుగా రానిస్తున్నాడు పొగరు గట్రా అంటున్నాడు. ఇంతకూ తను ఎవరి నెత్తిన బంతివేశాడు ఏమిటీ మిష్టరీ!

'వసంతావాళ్ళ నాన్నాగా రాయన. నిన్న నీవు వళ్ళు తెలీకుండా తన్నినబంతి వసంత నెత్తిన పడింది. అప్పుడే కోపంవచ్చి ఇంటికి వెళ్ళిపోయింది. ఇప్పటిదేమో ఈయన తగాదాకు వచ్చాడు' మెల్లిగా చెప్పింది గిరిజ.

వళ్ళు తెలీనంతకోపం వచ్చింది కుశాలరావుకు. విసురుగా బయటకు వచ్చాడు.

బామ్మ ఏదో సమాధానం చెబుతున్న దాయనకు.

'పళ్ళు దగ్గర పెట్టుకుని మాట్లాడండి. పొగరు, గిగరూ అని పెద్ద పెద్ద మాటలాడుతున్నారు! అసలు మీ అమ్మాయిని మగరాయుడులాగ అంతమందిలోకి రమ్మన్న దెవరూ! వచ్చినతర్వాత ఏదో ప్రమాదవశాత్తు జరిగిన సంఘటనకు చిలువలు పలువలు కల్పించుకుని పరగడుపునే పోట్లాటకు రావడానికి సిగ్గులేదూ' అన్నాడు కుశాలరావు.

'ఊరుకోరా నాయనా! నేను సర్ది చెబుతాగా!' అన్నది బామ్మ మనవడి నరసింహావతారంచూసి హడలిపోయి.

ఆ వచ్చినాయన ఇంకా ఏమిటో అంటూనే ఉన్నాడు.

'ప్రమాదవశాత్తు జరిగిందట! చేసినతప్పు చాలక! ఇంకా దబాయింపు కూడాను! చూడు నిన్నేం చేస్తానో ప్రిన్సిపాల్‌తో చెప్పి.'

ఆయన మాటలు పూర్తికాకుండానే అందుకున్నాడు కుశాలరావు! 'ప్రిన్సిపాలుతోకాదు, యూనివర్సిటీ రిజిష్ట్రార్ అడ్రసు ఇస్తాను' వెళ్ళి ఆయనతో చెప్పుకోండి. నలుగురూ చేరకముందె మర్యాదగా ఇంటికి వెళ్ళండి. ఇటువంటి తొందరపనులు తలపెట్టడం అంత ఆరోగ్యకరంకాదు' అని ఓ చిన్న సలహాయిచ్చి, ఆ వచ్చినాయన్ను భుజంమీద చేయి వేసి బయట వీధిలోదాకా సాగనంపివచ్చాడు.

మనసంతా చికాకయిపోయింది. వసంతట వసంత! ఆదివారం సంతలాగ. ఆమె మొహంలోనే ఉంది అసలు—వెధవ గుణాలు—అంతా ముచ్చు వ్యవహారం.

చాలా చికాకుపడిపోయి ప్రస్తుతం ప్రేమించడం వాయిదావేసుకున్నాడు కుశాలరావు. ☆

కొని—అందులో పట్టు పిన్నుపెట్టి పవళించి ఎప్పటి కయినా నా నాథుడు తిరిగి రాడా అని, మధుర స్వప్నాలు కనసాగాను. నా నాథ్ రాలా. రాడని ఫలానా చెప్పాడు. నాకూ తెలుసు. ఇంక అక్కడినుంచి నేను పడిన బాధలూ కష్టాలూ కలిసి—'చిత్రఖేదము' అనబడును. ఆ ఘట్టాన్ని వివరిస్తున్నానన్నమాట!

నన్ను ఆ తర్వాత చాలామంది ప్రశ్నలు వేశారు "అయ్యా—మీ చిత్రం ఎప్పుడు ప్రారంభిస్తారు? తార లెవరు? ఎక్స్ట్రాలెవరు? రచన ఎవరు? పాట్ల డైలాగులు మీరేనా?" అని ఇట్లా. నేనేమీ సమాధానం చెప్పేవాడిని కాదు. కొందరు కొందరు వ్యంగ్యంగా "దర్శకుడుగారూ" అని, 'డైరెక్టర్ సాబ్" అనీ పిలిచేవారు. 'నవ్విన నాపచేను పండదా? అని పాడుకుని ఊరుకునేవాడిని. నేను ఎట్లా బతికానో నాకే తెలీదు. ఊరు విడిచి, ఏ ఊరేనా పోదామనుకున్నాను. మరేదేనా ఉద్యోగం చేదా మను కున్నాను కాని—'రాబర్ట్ బ్రూసు' నా బుర్రమీద 'సూపర్ ఇంపోజ్' ఐయేవాడు. ఒకరోజున బ్రూసును పిలిచి కేక వేశాను కూడా!

"నా తప్పేం ఉంది—సాలీడు నడుగు" అన్నాడు బ్రూసు.

నాకు ఎక్కడా శాంతి సౌఖ్యమూ కనిపించలేదు. ఎంతసేపూ అసావేరి, శివరంజనీ, ముల్తాన్ రాగాలే వినిపించేవి. ఎక్కడయినా అసిస్టెంటుగా చేరదా మనుకున్నాను. అహం అడ్డొచ్చింది.

"ఆగు" అంది అహం— "ఇన్నాళ్ళూ ఇన్నేళ్ళూ ఇంతపేరు మోసి, చివరకు మళ్ళీ సహాయ దర్శకుడివై క్లాప్‌బోర్డు పట్టుకుంటావా?"

"మరి నన్నేం చెయ్యమన్నావు? నేనీజీవితం భరించలేను— నాకడుపుమంట చల్లారేదెట్లా? ల్లారేదెట్లా?"

"హాఁహాఁహాఁ... అందనిపండుకు ఆశించడం అవివేకం. కాని నువ్వు అందేపండుకోసమే ఆశపడు తున్నావు. ఆపండు అందేటంతవరకూ ఎన్ని కష్టాలూ, గాలివానలు, నాదనామక్రియరాగాలూ వచ్చినా సరే, నువ్వు ఎదుర్కోవాలి, నీలో చిత్ర రక్తం ప్రవహించడంలేదా? నీవు చిత్రవ్యక్తివి కావా? చిత్రమాత కడుపున పుట్టిన నీకేల ఈ చిత్రఖేదము?"

"నాకు అడ్డంరాకు—లే—లే" అని వికటాట్ట హాసంచేసి, అహాన్ని తన్ని ఒకపెద్దడైరెక్టరనుచూశాను.

"రండి కూచోండి' అని మర్యాద చేశాడతను.

"మీదగ్గర కొంతకాలం సహాయదర్శకత్వం చెయ్యాలని..." అని గొణిగాను అంతవరకూ నన్ను మీరు అని నుప్పించే ఆ పెద్దమనిషి— ఈమాట వినగానే—

"చేస్తావా—చెయ్యి, నేర్చుకో. అసలు ముందు లేచి నించో. డైరెక్టర్లదగ్గర ఎట్లానించోవాలో నేర్చుకో ముందు" అన్నాడు.

"చిత్తం."

"సార్ అనికూడా అను."

"చిత్తం సార్"

"రైట్. యూ ఆర్ మై అసిస్టెంటు. ఐతే. నీకు మూడు నెల్లదాకా జీతంవుండదు. అప్రంటీసు చెయ్యి"

# చిత్రఖేదము

23–వ పేజీ తరువాయి

"నేను అప్రంటీసు ఏమిటండి"

"ఏమిటండీ అని అడక్కు. నీకు డైరెక్టరుగా అనుభవం ఉందిగాని—అసిస్టెంటుగా లేదే! అందు కని అసిస్టెంటుగా అప్రంటీసు చెయ్యాలి—కొన్నా ళ్ళకు అనుభవంతెచ్చుకుంటావు. అప్పుడు నీకు అరవై రూపాయలు జీతం అని చెప్పి—ముప్ఫయ్యయిదు ఇప్పిస్తాను. ఏమంటావు?" అని లేచాడు దర్శకుడు.

నేనూ లేచాను— అంటే నించునివున్నవాడిని బయటకు పోవటానికి.

"ఏం పోతావా—నీయిష్టం. అసలు నీవంటి అనుభవం వున్నవాడితో చిక్కువుండనే వుందనుకో! ఏమీరానివాడయితే ప్రిఫరెన్సు. ఐనా, స్పెషల్ కేసుమీద, నిన్ను బుక్‌చేయిస్తాను—వద నిర్మాతతో చెబుతాను. నువ్వు ముందుగా వెళ్ళి— ఆఫీసుదగ్గ రుండు. నేను కార్లో వస్తాను" అని కారెక్కిపోయాడు

కారు నాముందునుంచే తుర్రుమంది!

ఇరవై నిముషాల తర్వాత అక్కడికి చేరుకున్నాను.

"ఏవయ్యా అసిస్టెంటూ — నాకంటెముం దుగా వచ్చి కూచోవయ్యా అంటే, ఎక్కడెక్కడో తిరిగి ఇప్పుడు వస్తున్నావా — నీ ఇన్‌సిన్సిరిటీ ఇప్పుడే ప్రారంభం!" అన్నాడు దర్శకుడు. నేనేం మాట్లాడలేదు. దర్శకుడు లోపలికు పోయాడు. నేనట్లాగే ఆగుమ్మంలో నించున్నాను— గంటసేపు. ఆ తర్వాత, ఆఫీసుబాయ్ గావును సైకిలుదిగి— "యూరు?" అని గసిరాడు.

"డైరెక్టరుగారు...." అన్నాను.

"ఇల్లె ఇల్లె—" అని వాడు లోపలికుపోయి మళ్ళీ వచ్చి — "వుక్కారు — అవరు డిస్కషన్‌లే ఇరి క్కారు. వెళియిలే వుక్కారు" అని గద్దించి, ఫ్లాస్కుతో సైకిలెక్కి వెళ్ళిపోయాడు! నాకు చాలాకోపం వచ్చింది. ఎంతనీచంగా వున్నాను— అనుకున్నాను. కానీ—ఏం చేస్తాను, అని అరుగు మీదే కూచున్నాను.

రాత్రిపదిగంటలు దాటాక, దర్శకుడు బయ టకు వచ్చాడు. నన్ను చూసి—"ఓహో నువ్వా— ఏం ఇక్కడున్నావ్ — ఆహాఁ...చెప్తాను — రేప్పొ ద్దున్నే ఇక్కడికిరా" అని కారెక్కి వెళ్ళిపోయాడు.

"నాన్ చొల్లిల్లియా — అవళవుదాఁ—అవర్ పాకమాట్టారు" అని నవ్వాడు, నౌకరు



# చిత్రఖేదము

నేను కాళ్లీడ్చుకుంటూ, ఈడ్చుకుంటూ వెళ్లాను ఎక్కడికో నాకు తెలీదు. కాళ్లల్లో శక్తి సన్నగిల్లి పోయింది. అక్కడేదో అరుగులాగా కనిపించింది. చూడగానే పార్కు బెంచి! హారి— నాకుతెలియకుండా నాకాళ్లే నన్నిట్లా తీసుకువచ్చేశాయి, వాస్వర్గ సీమకు! ఆసీమలో వాలి వాలిపోయాను.

"లెండిసార్ లెండి.... ఏమిటీ నిద్ర.... ఏమిటి దయిలేనూ— లెండి లెండి... అవుట్ డోర్‌కు ప్రశస్తమైనవండ. .." అని వినిపించింది— చటుక్కున కళ్లు తెరచి చూచాను—ఫలానా! నన్ను లేపుతున్నాడు!.... ముందు కలగన్నానా అనుకున్నాను. ఇదే సంభాషణ పలుకుతూ, ఆనాడు ఫలానా నన్ను లేపాడు. ఆనాడు లేపటంలో ఎంత ఆనందం వుంది! ఈనాడు లేపటంలో ఎంత విషాదం వుంది!

లేచి ఏం ప్రయోజనమోయ్! ఎవరికోసం లేవను, ఎవరికోసం బ్రతకను?" అన్నాను పాపీగా.

"ఏమిటిది గురూ! జీవితంమీద విరక్తి కలిగినట్టుంది. విరక్తి కలిగినప్పుడే ఈ పాపిష్టి లాగులు వచ్చేది! లెండి— ఎవరికోసం నిద్రపోయారో వారి కోసమే లెండి"

లేచాను ఛట్టున! ఎందుకంటే నిర్మాత ఏమన్నా రాశాడేమో ననిపించింది.

"ఏమన్నా రాశాడయ్యా?"

"ఊరుకోండి గురూ. వాడు రాయటం, మనం బ్రతకటం అన్నీ ఒకటే. ఉండండి—మా ఊరెళ్తానుగా—అప్పుడు చెప్తాను" అన్నాడు ఫలానా పిడికిలి బిగిస్తూ. ఫలానాను కూచోబెట్టి, వాసంగతంతా వివరించాను.

"అదేంటి గురూగారూ! మీవంటివాళ్ళు మళ్ళీ మళ్ళీ మాడి చచ్చినా నేను సంతోషిస్తాను గాని, మళ్ళా అసిస్టెంటుగా జేరటం మాత్రం సహించను!" అన్నాడు ఉద్రేకంగా.

"ఏంచెయ్యను ? .... కొన్నాళ్లపాటు ఘటం నడవాలి గదా."

"సరే జేరండి—కాస్త చిన్న వేషమైనా నాకిప్పించకపోతారా—"

ఫలానా ఘటికుడు. ఎట్లా తెస్తాడో, ఎక్కడి నుంచి తెస్తాడో మరి, జేబులో రెండు రూపాయలున్నాయి. నాకు బాగా టిఫిను యిప్పించి, అర్ధరూపాయి చేతిలో పెట్టబోయాడు.

"చాల్లేవయ్యా—సంభావన కూడానూ" అన్నాను.

"ఉంచండి గురూ—మధ్యాన్నం భోజనానికి రాకపోయినా, టిఫినుకేనా పనికొస్తుంది" అని జేబులో వడేశాడు.

ఫలానాతో చెప్పి, డైరెక్టరు కోసం బయలు దేరాను. సెయంత్రం మీటవుతానని ఫలానా వెళ్లి పోయాడు. నేను వెళ్లేసరికి డైరెక్టరు ఇంకా రాలేదు. బయట కూచున్నాను—నౌఖరు కంట బడకుండా. కాస్సేపట్లో డైరెక్టరుగారు కారు దిగాడు. గుడ్‌మార్నింగ్ కొట్టాను.

"రా—రా— .... ఏం బయట కూచున్నావు పాపం .... ఒరే బాయ్— బుద్ధిలేదురా నీకు—లోపల కొచ్చి కూచోమనకపోయావు ?" అని గమర్తూ నన్ను లోపలకు తీసుకుపోయాడు.

"కూచో" అన్నాడు. అక్కడెక్కడ కూచో వాలో నా కర్థంకాలేదు— కుర్చీలూ, బల్లలూ ఏమీ లేవు

"అవును—ఇక్కడ కూచునేటందుకు ఏమీ ఉండవు మా ప్రొడ్యూసరుగారు బలేవాడు. స్క్రిప్టు మీద కూచుంటాం అంటే, కుర్చీలూ, బెంచీలూ తీయించేశాడు. కిందనే కూచో. కాస్సేపటికి రైటరు వస్తాడు. రాగానే మే మందరం ఆ స్క్రిప్టు మీద కూచుంటాం—ఓకే ?" అన్నాడు దర్శకుడు.

"కాని మీరు కూచోకుండా నే నెట్లా కూచోను?

"వెరీగుడ్. నీకు మంచి జీతం యిప్పిస్తాను— రానీ, నిర్మాత రానీ!" అని దడిపించాడు!

కాస్సేపటికి నిర్మాతా, కవీ వచ్చారు.

"అయ్యా — ఇతను మహాశయుడు! మనకు అసిస్టెంటుగా ఉంటాడు. డైరెక్టరుగా మంచి అనుభవం ఉన్నవాడు—తెలిసినవాడూనూ. నెలకు నూరు రూపాయల జీతము యివ్వండి. ప్రొడక్షన్ నన్ను కూడా చూస్తాడు. ఇప్పుడో పాతిక అడ్వాన్సు యివ్వండి" ఆ నిర్మాత మారు మాట్లాడకుండా పాతిక రూపాయలు నా చేతికిచ్చాడు. ఆ డబ్బు చూసేటప్పటికి నా కళ్ళు తిరిగాయి. మా డైరెక్టరుగారు ఎంత మంచివాడో!

"అబ్బాయ్, నువ్వు ఇంక బయట రూములో కూచో—వస్తున్నవాళ్ళు వస్తూవుంటారు— కూచో!" అన్నాడు దర్శకుడు. నేనొచ్చి ముందు రూములో కూచున్నాను. ఇంతలో నౌఖరు కుర్రాడు పరుగెత్తుకుంటూ, ఏడ్చుకుంటూ వచ్చి —"సార్ సార్, మన్నిచ్చిడింగో సార్— తెరియామే ఉళర్‌నే—తెరియామే వుళర్‌నే—యున్నే మన్నిచ్చి డింగో" అంటూ కాళ్లమీద పడ్డాడు. వాడిని లేవనెత్తి మన్నించానంటే కాని ఏడుపు మానలేదు.

అట్లా కూచుని ఉండగా, ఒకామె వచ్చి నమస్కరించింది.

"ఎవరండీ ?" అన్నాను.

"నాపేరు ఇందిరండీ. అసలుపేరు దమయంతనుకోండి మాది బందరండీ. మంచి నాటకానుభవం ఉందండీ—ఈఊరొచ్చి రెండునెల్లయిందండీ. మీ సినిమాలో ఏదేనా వేషం ఉంటేండీ—"

"కూచోండమ్మా. వేషాలు ఏమున్నాయో ఏమిటో నాకేం తెలీదు. నేనే కొత్త. ఇవాళే వచ్చాను."

"వస్తే మాత్రం ఏముందండీ. తప్పకుండా ఏదేనా వేషం యిప్పించండి. ఏ వేషమైనా ఫర్వాలేదు కాస్త మంచి వేషం మాత్రం యిప్పించండి. చాలా నాటకాల్లో వేశానండీ—నన్ను సినిమాల్లోకి వెళ్లమని, మా ఊళ్లో అంతా బలవంతం చేశారండీ" అన్నదామె.

(సశేషం)

ల్సింది తటాలున తెచ్చియ్యడం, ఇలాంటివన్నీ చాలా నేర్పుగా సున్నితంగా చేయడంతో రామ్మూర్తి చాలామందిని ఆకర్షించేవాడు. పైగా చాలా నమ్మకస్థుడు. యజమానికి అతనంటే ఎంతో విశ్వాసం ఉండేది. ఈ అనుభవం సాయంతో, కొన్నాళ్ళకి రామ్మూర్తి ఒక చిన్న అరుగుమీద స్వంతంగా వేరే కొట్టు పెట్టాడు. అదలా అలా కొన్నేళ్ళమీద విస్తరించి ఈనాడు మెయిన్‌రోడ్‌మీద ఓ పెద్ద మేడలో ఎంపోరియంగా మారింది. రామ్మూర్తి నెరిగినవాళ్ళు, యెరగనివాళ్ళు కూడా, ఇంచుమించు తెలియకుండానే అందులో కడుగుపెట్టారు ఏం కావాల్సినా.

పెద్ద హాల్లో ఎన్నో విభాగాలుచేసి, ఇరవైమందిదాకా పనివాళ్ళని పెట్టుకున్నాడు రామ్మూర్తి. అతనిప్పుడు చేసే పనల్లా వీళ్ళందరు సరిగా నడుచుకుంటున్నారో లేదో అజమాయిషీ చేస్తూండడమే. ఎవరన్నా మరీ పెద్దమనుషులొస్తే వాళ్ళకి కుర్చీలు వేసి, కుశలప్రశ్న లడిగి, తాగితే టీ ఇచ్చి వాళ్ళ క్కావల్సినవన్నీ అక్కడికే తెచ్చియ్యడంలో రామ్మూర్తి రోజురోజుకీ ఎక్కువ ప్రజ్ఞ సంపాదించాడు. ఆ విషయంమీద రాబోయేతరాలవాళ్ళ కుపయోగపడేట్టు ఓ పుస్తకం రాయమని కొంత మంది రామ్మూర్తి వెంటబడ్డారుట కూడా.

అతను నెమ్మదిగా లోపలి కడుగులు వెయ్యడం చూశాడు రామ్మూర్తి.

అతనివంక పైనుంచి క్రిందిదాకా కొలుస్తున్నట్టు చూశాడు. ఎర్రని శరీరం; పొడుగూ కాదు, పొట్టీ కాదు; లేత నీలంరంగు శ్లాక్, తెల్ల లాగు, ఫుల్ బూట్—అదీ ఆకారం. రామ్మూర్తి అలా ఒకసారి చూసి, అతని హోదా, స్థాయి అంతా అంచనా కట్టాడు.

ఈమాదిరి మనుషుల లక్షణా లేమిటో రామ్మూర్తికి క్షుణ్ణంగా తెలుసు. వీళ్ళకి వేటిపైనా ఖచ్చితమైన అభిప్రాయా లుండవు. కంటికి బాగా కనబడితే చాలు, కొనేస్తారు. బేరమాడరు. డబ్బు ఎంతైనా పట్టించుకోరు. వీళ్ళని 'పడగొట్టడం' చాలా సులభం; కొంచెం అతి మర్యాద చూపించా లంతే.

కొట్టుకంతకీ వెనకాలగా ఎక్కడో ట్యూబ్‌లైట్ల కాంతిలో మెరుస్తున్న రామ్మూర్తి త్వరత్వరగా లేచి ముందుకొచ్చి నమస్కారం చేశాడు. కొట్టులో అంతా అతనివంక వింతగా చూస్తోంటే, అతన్ని ఈ లోకపు మురికి, పాపం వగైరాల్నుంచి దూరంగా తీసుకువెళ్తున్నట్టు ఈ రద్దీ అంతటినించీ విడిగా వెనకగా సోఫాలో కూర్చోబెట్టి, వినయంగా నిలబడి కుశలప్రశ్నలు వేశాడు.

అత వీ మన్ననలు, మర్యాదలు గమనించి వాటిలో ప్రత్యేకత అర్థంచేసుకున్నట్టు కనబళ్ళేదు. ఇలాంటివన్నీ మామూలే నన్నట్టు వీటి మోసాలకి లొంగనట్టు స్తబ్ధుగా ఉన్నాడు.

రామ్మూర్తి మనస్సు చివుక్కుమంది. దాంతోబాటు పట్టుదలా ఎక్కువైంది. అతనితో ఎలాగైనా ఇంకా ఇంకా మర్యాదగా మాట్లాడి తన చిట్కాలు ప్రయోగించా లనుకున్నాడు.

అత నసలు ఈ లోకంలో ఉన్నట్టు కనబళ్ళేదు. ఏ బిచిలోనో ఆకాశం నీలంవంక చూస్తూ తన్మయుడైనట్టు, తాపీగా, మూగగా, నిశ్చలంగా కూర్చుండిపోయాడు.

# తమాషా

16-వ పేజీ తరువాయి

కొనడానికి వచ్చినవాళ్ళకి అనుకూలవాతావరణం కల్పించి, ఆతర్వాత వాళ్ళపైన తన ప్రభావం పనిచేసేలా చెయ్యాలనేది రామ్మూర్తి ముఖ్యమైన వ్యాపార చిట్కాల్లో ఒకటి. కాని అతనివిషయంలో ఈ చిట్కా పనిచేస్తున్నట్టు కనబట్టంలేదు. తన ప్రభావం అతడిపైన పనిచెయ్యడం అలా ఉంచి, అతని మూగతనం తనకి పట్టుకుంటోంది. రామ్మూర్తి తికమకపడ్డాడు.

ఇతనేమన్నా వేదాంతేమో! వేదాంతయితే అంత నాజూకుబట్ట లెందుకు కడతాడు? కవా? రచయితా? "రసహృదయుడా?" "స్వాప్నికుడా?" ప్రేమికుడా? రామ్మూర్తి కీతెగల మనుషులో అంతగా పరిచయంలేదు.

రామ్మూర్తి మెదడు ఇన్నాళ్ళకి పనిచెయ్యడం మానేసింది. వచ్చినవాళ్ళని చూడగానే వాళ్ళమొగాలబట్టి అవసరాలు గుర్తించి అవన్నీ వదిసార్లు చెప్పించుకోకుండా నేర్పుగా నెరవేర్చగలనన్న రామ్మూర్తి అహం కొద్దిగా దెబ్బతింది.

చక్కని బాండ్‌పేపర్‌పాడ్‌లు, అందమైన డైరీలు, ఫైళ్ళు, ఇంక్‌పాట్‌లు, పేపర్ వెయిట్స్ వగైరా కొత్తరకాల ఫాన్సీ వరుకులన్నీ తీసుకొచ్చి గుమ్మరించాడు. వాటన్నిటిని ఒక్కొక్కటిగా విప్పి చుట్టూ పరిచాడు.

"ఇవన్నీ మీకు కొత్తగావనుకోండి; ఇంతకుముందే కొనుంటారు; అయినా చూడండి. తమలాంటివాళ్ళంతా ఇవెక్కువగా కొంటున్నారీరోజుల్లో ...." రామ్మూర్తి అతి వినయం ఒలకబోస్తూ చెప్పుకుపోతున్నాడు.

అత నేవో ఇతర లోకాల్లోంచి ఈ లోకంలో కూడిపడ్డట్టు, ఉలిక్కిపడి వాటివంక చూశాడు. ఆ చూపులో భావం ఏమిటో కనిపెట్టాలని యమయాతనపడ్డాడు రామ్మూర్తి.

"ఇవికాదు; మంచి చీరలు చూపెట్టండి" అన్నాడతను చివరికి.

రామ్మూర్తి మొహంమీద దరహాసం విరిసింది. సమస్య విడిపోయింది. అతని ఆలోచన లెలా ఉంటాయో త నూహించగలడు; ఇంకతను తన చేతిలో చిక్కినట్టే.

ఎన్నోరకాల చీరలు బాగా ఖరీదైనవి అన్నీ చుట్టూ పడేసి ఒక్కొక్కటే చూపెట్టాడు. వాటి నాణ్యం, ధరలు అన్నీ గుక్కతిప్పుకోకుండా వప్పజెప్పాడు, మధ్య మధ్య ఆడవాళ్ళగురించి, వాళ్ళ అభిరుచులుగురించి ఛెణుకులు విసురుతూ.

"అసలు ఆమెని కూడా తీసుకొచ్చి ఉండాల్సింది. సాధారణంగా మన మేం తెచ్చినా వాళ్ళకి నచ్చవు. మా అమ్మాకి నేనేం తెచ్చినా పనికిరాదు. తనే వెళ్ళి మళ్ళీ వీటినే తెచ్చుకుంటే అది వేరేమాటన్కోండి." రామ్మూర్తి చాలా హుషారుగా ఆత్మకథ కూడా మిళాయించి చెప్పేశాడు.

అతను అదోలా నవ్వాడు.

"అయినా ఇంకోటుందిలెండి; చీర కొంటామని ముందు వార్నింగ్ ఇచ్చి ఇక్కడికి తీసుకొచ్చి వాళ్ళనే యేరుకోమనడంకన్నా, మంచిదొకటి పట్టుకెళ్ళి యే రంగురంగుల సాయంకాలాన్నో, యే వెన్నెలరాత్రో హఠాత్తుగా ఆశ్చర్యపరచడం—అదెక్కువ ఆనందం" రామ్మూర్తి తనకి కలిగిన ప్రణయపరిజ్ఞానంకూడా ఏకరువుపెట్టాడు.

అతని మొగంలో మార్పు లేదు. చెయ్యి ఓ సిల్కుచీర మడతలపైన సున్నితంగా జారుతోంది.

"ఇది చాలా బాగుంటుంది. తాకడానికి మనువుగా, మెత్తగా. ఈ రోజుల్లో నాజూకుమనుష్యులకి ముదురుబట్ట లేం పనికొస్తాయండి?" రామ్మూర్తి నవ్వాడు.

త నెన్ని మాటాడినా అతనేం చెప్పకపోవడం రామ్మూర్తికి చికాగ్గా ఉంది. అతని చెయ్యి అలాగే

# తమాషా

ఆ మెత్తని సిల్కుచీరని నిమురుతోందిగాని, రామ్మూర్తి మాటలేవీ వినిపించుకున్నట్టు లేదు.

"ఆమె కేది సరిపడుతుందో తెలియక ఇబ్బంది పడుతున్నా రనుకుంటాను. ఎలా ఉంటారు చెప్పండి, నేను చెబుతాను."

"బాగా పచ్చన."

"సన్నమా, కొద్దిగా పుష్టిగా ఉంటారా ?"

"సన్నం."

"పొడుగా, పొట్టిగా ఉంటారా ?"

"పొడుగు."

"అయితే ఈ 'ప్లెయిన్ బ్లూ' తీసుకోండి. ఈరోజుల్లో 'క్లాస్' మనుష్యులంతా ఇవే వాడుతున్నారు. ఒకవేళ అంతగా ఆమెకి నచ్చకపోతే మళ్ళీ పట్టుకొచ్చియ్యండి. దాని కేం అభ్యంతరంలేదు. నిక్షేపంలా పుచ్చుకుంటాం." రామ్మూర్తి అంతా తనే నిర్ణయించేసి అత నంగీకారం లేకుండానే పాక్ చేసి బిల్లు పట్టుకొచ్చేశాడు.

అతను రోడ్డువైపు చూస్తున్నాడు రామ్మూర్తి, మళ్లీమళ్లీ ఆ చీర నాణ్యంగురించి, అదామెకి సరిగ్గా యెలా అతికేదీ, ఒకవేళ ఆమెకి నచ్చకపోతే తిరిగి ఇవ్వచ్చుననే వివరం అన్నీ బాగా మనసులో నాటేట్టు చెబుతున్నాడు. అతనేం మాట్లాడలేదు. శిలాప్రతిమలా అతనిచ్చిన పాకెట్, బిల్లు పుచ్చుకుని మాటపాతిక రూపాయలూ చెల్లించాడు.

అతను వెళ్లబోతూంటే రామ్మూర్తి తన వ్యాపార చిట్కాల్లో అతి ముఖ్యమైనది ప్రయోగించాడు "ఈ నెల్లో వందకి మించి బిల్లుచేసినవాళ్లకి చిన్న చిన్న బహుమతుల్లాంటి విస్తున్నాం. మీ రీబిల్లు ఆమూల చూపించండి అక్కడున్నవాటిలో ఆమెకి నచ్చుతుందనుకున్నదాన్ని ఏదన్నా తీసుకోవచ్చు. పౌడర్ టిన్స్, ఫ్లవర్ వేసెస్, ఫోటో స్టాండ్స్, సెంట్ బాటిల్స్, హెయిర్ నెట్స్ చాలా ఉన్నాయి."

అతను బిల్లు, పాకెట్ పుచ్చుకుని క్రిందికి వెళ్లిపోతున్నాడు. ఒకవేళ వినబడలేదేమో మళ్లీ చెబ్దామనుకున్నాడు రామ్మూర్తి. మళ్లీ పోనీ యని పించి ఊరుకున్నాడు.

రామ్మూర్తి జీవితంలో ఆరోజు కో ప్రత్యేకత ఏర్పడింది. అలాంటి మనుష్య లంతకుముం దతనికి తారసిల్లలేదు. ఆ అనుభవ మొక వింత. అయినా సరే, ఇలాంటి ఏంతమనిషిచేతకూడా తన కిష్టం వచ్చిన మాదిరి ఖరీదుచేయించగలిగిన తన నైపుణ్యానికి అభినందించుకున్నాడు. రామ్మూర్తి డైరీలో తారీఖు చుట్టూ ఎర్ర పెన్సిల్తో సున్న చుట్టుకొని ఈ విషయం రాసుకుంటుంటే తటాలున గుర్తుకొచ్చింది.

వెంటనే, కొట్టు వదిలి పదడుగులు ముందుకు వేసి అతన్నాపి అడిగాడు : "క్షమించాలి, మా కస్టమర్స్లో కొంతమంది పెద్దతరహా మనుష్యులవి ఎడ్రసులు నోట్ చేసుకోడం మా కలవాటు. మీ కభ్యంతరం లేకపోతే చెప్పండి."

"శివరావ్. రిపోజ్" ఏ వీధిలో ఉన్నదీ చెప్పి వెళ్లిపోయాడు.

'రిపోజ్ !' ఎంత బాగుంది పేరు. ఎంత శాంతి ! ఏదో అంతులేని ఆనందంలాంటి విషాదం ! లేక విషాదంలాంటి ఆనందం ! ఆ నెప్పటికైనా ఇల్లు కట్టి ఆ పేరే పెట్టాలనుకున్నాడు రామ్మూర్తి. రామ్మూర్తి మనసులో అతనిముద్ర ఎప్పటికీ చెరిగిపోకుండా నిల్చిపోయింది.

* * *

ఆ సాయంకాలం కొట్టు మూసేశాక, ఇంటి కెళ్లి స్నానం వగైరా కానిచ్చి వరండాలో ఈజీ ఛైర్లో కూలబడి పేపరు తిరగేస్తున్నాడు. అమ్మాయి రేడియోదగ్గిర కూర్చొని అటూ ఇటూ స్టేషన్లు వరసగా తిప్పుతోంది. భార్య లోపలెక్కడో ఉంది.

బర్ బర్మని అదిరిపోయేలా అంత పిచ్లోనూ అటూ ఇటూ విసుగ్గా తిప్పేసి కూతురు సగం స్వగతంలో అనుకొంది: "ఇదేమి రేడియోనో!! కావల్సినప్పుడు కావలింది రాదు. సాయంకాలం రికార్డులు విందామనుకునేప్పుడు నీతిపాఠాలు' రాత్రి పడుకోబోయేప్పుడు, పడుకున్నాక రికార్డులు!"

తండ్రివంక చూసింది రమ, రోజూలాగ తనతో మాటలు కలుపుతాడేమోనని కలపకపోవడం చూసి, "తమాషాచూడు నాన్నా ! ఈ ప్రపంచంలో మన క్కావల్సింది తప్పించి అన్నీ సమృద్ధిగా దొరుకుతాయి." అంది కొత్తగా కాలేజీలో జేరి సంపాదించిన పెద్దరికాన్ని ప్రదర్శిస్తూ.

రామ్మూర్తి మాట్లాడలేదు.

"దానికి రికార్డులు కావాల్ట. మీరు కాస్త చూసి పెట్టకూడదూ ! ఏమిటా పరధ్యానం ?" అంటూ వెనక్కి వచ్చి నిలబడింది అప్పుడే అక్కడి కొచ్చిన పెళ్లాం.

రామ్మూర్తి పేపరు పడేసి రేడియోదగ్గిర జేరి కాస్సేపు అటూ ఇటూ తిప్పాడు.

"నీ కసలు చాతగావడంలేదు, ఉండు " అని తప్పించింది కూతురు.

రామ్మూర్తి నుదుటిమీద వేళ్లు బాధగా మత్తుగా రాసుకున్నాయి. మళ్లీమళ్లీ ఆ వార్త వంకే చూడసాగాడు.

"చావుకబుర్లుకూడా అంత దీక్షగా చూడాలేమిటి ?" సాగదీసింది పెళ్లాం.

రామ్మూర్తి కేం చెప్పాలో, ఎలా చెప్పాలో అర్థం కాలేదు. కొన్ని విషయాలు పైకి చెప్పడం సంభవం కాదు, ఎంత దగ్గిరవాళ్లకైనా సరే. పేపరు కింద పడేసి "తమాషా" అని మాత్రం అనుకోగలిగాడు సగం పైకి.

ఆనాటి పేపరు "పర్సనల్" కాలములో మూడు లైన్లు :

"డియర్ లీలా,

నీ అందం ఈ లోకాన్ని కాంతితో నింపడం మానేశాక అప్పుడే ఏడాది వెళ్లిపోయింది; కాని నీగురించిన జ్ఞాపకాలు నాలో రంపపుకోత పెట్టకుండా ఒక్క క్షణం— కదలదు !

నీ స్మృతులే ఆధారంగా ఈ చీకట్లో మిగిలిన,

శివరావ్,

'రిపోజ్'

★



గోలిమి ప్రొడక్షన్ వారి "మహామంత్రి తిమ్మరుసు"లో ఒక దృశ్యం.

"నువ్వు రా" అన్నాడు రవి

"రవీ ! ఏమిటీపని ?" అన్నది చిత్ర

"మంచిపనే వాడు మంచివాడు కాదు నువ్వొచ్చేసెయ్" అని రవి, ఆమెను పట్టుకొని లాగబోయాడు ఆమె, విదిలించుకోబోతూ "నేను రాను, మీరు వెళ్ళండి' అంటున్నది రాము లేచి, రవిని కొట్టాడు దెబ్బతో రవి, గదిఅవతల పడ్డాడు అంతతో ఆగకుండా రాము, మళ్ళీ కొట్టాలని బయటకు దూకబోయాడు 'ఆగండి' అన్నది చిత్ర రామూ వినిపించుకోలే ఆమెను తోసివేసి బయటకు వెళ్ళి రవిపై కలియబడ్డాడు ఇద్దరిమధ్యా 'యుద్ధం' చెలరేగింది. ఇద్దరూ కొట్టుకున్నారు—తోసుకున్నారు— చివరకు రాము క్రింద పడిపోయాడు ఇంతలో చిత్ర అక్కడికి వచ్చి ఆవేశంగా రవితో "మీరు వెళ్ళిపొండి ఇక్కడినుంచి" అన్నది "మరి నువ్వో ?" అన్నాడు రవి రొప్పుతూ

"నేను రాను"

"ఇక్కడే ఉంటావా ?"

"ఆసంగతి మీా కనవసరం తండ్రివాటి బిడ్డ— తండ్రి దగ్గరకే వెళ్ళండి పొండి" అ... దామె వెరిగా రాము పరిస్థితి అర్థంచేసుకున్నాడు –"హు ! నిన్ను ఇప్పటి ...ర్థంచేసుకోగలిగాను వీధిలోంచి వచ్చినదానివి వచ్చి వీధిలోకే చేరావు" అన్నాడు

"దానికి కారకులెవరో ఒకసారి ఆలోచించుకోండి"

"ఆలోచించాను నేను నిన్ను వీధిలోంచి ఇంటికి

# "ఇరుగు పొరుగు"

12-వ పేజీ తరువాయి

తీసుకువెడదా మనుకున్నాను. కాని, నీ కది యిష్టంలేదు. నువ్వు వాడితోనే ఉండు" అన్నాడు రవి.

ఈ మాటకు చిత్ర వెర్రెత్తినదానల్లే "వని వెళ్ళండి" అని అరిచింది.

"వెడుతున్నాను. కాని వెళ్ళేముందు నీ కొక వార్త చెప్పి వెడతాను. మీ అమ్మ మేడమీదనుంచి పడి ఆసుపత్రిలో చనిపోయింది." అని చెప్పాడు రవి.

పిడుగులాంటి ఈ వార్త విని, చిత్ర కొయ్య



ఇద్దరు మిత్రులు శతదినోత్సవ సంద... ...లో జరగిన విందులో పాల్గొన్న కొందరు ప్రముఖులు.



నవీనచిత్రవారి 'సవతికొడుకు'లో వాసంతి.



'ఏకశిల్పం' సెట్టుమీద దర్శకుడు చాణక్య, హేమలత, రామారావు, నారాయణస్వామి
ఫొటో . రూప.

# "ఇరుగు పొరుగు"

జారిపోయింది వంటిమీద స్పృహ తప్పిపోయింది "ఏమన్నారు ? మా అమ్మ ." అన్నది తడబడుతూ

"చనిపోయింది మీ నాన్న పిచ్చెత్తి వీధులవెంట తిరుగుతున్నాడు" అని మరో పిడుగులాంటి వార్త చెప్పాడు "నా న్న" అన్నది చిత్ర వినీ విని పించకుండా

రవి ఛర్రున తిరిగి బయటకు పోబోయాడు చిత్ర అతనిదగ్గరకు వచ్చి చెయ్యి పట్టుకున్నది— "రవీ, నేనూ మీతో వస్తాను నన్ను తీసుకెళ్ళండి" అన్నది ఏడుస్తూ

"నిన్ను తీసుకెళ్లేవాళ్ళు చాలామంది ఉన్నారు నాకూ నీకూ ఉన్న సంబంధం పూర్తిగా తెగిపోయింది" అన్నాడు రవి చెయ్యి విదిలించుకుని, బయటకు చరచరా పోతూ "రవీ, రవీ" అని ఏడుస్తూ అతని వెనకే పరుగెత్తింది—చిత్ర !

ఇటీవల వీనస్‌లో 'షూట్' చెయ్యబడిన రస వత్తరమైన ఈ ఘట్టం కళాప్రపూర్ణవారి 'ఇరుగు పొరుగు' చిత్రంలోనిది ఇందులో రవిగా ఎన్ టి రామారావు, రాముగా బాలయ్య, చిత్రగా కృష్ణ కుమారి పాల్గొన్నారు ఈ ఘట్టానికి 'ముందు వెనుకలు' వెండితెరమీద చూడవలసినవి !

పైవారుకాక ఈ చిత్రంలో రేలంగి, గుమ్మడి, సి. ఎస్ ఆర్, నాగయ్య, బాలకృష్ణ, శోభన్‌బాబు, మద్దాలి, రామకోటి, సంధ్య, గిరిజ, నిర్మల, నూతన నటి గౌరి ఉన్నారు ఈ చిత్రంలో 'చంద్రలేఖ' టి. ఆర్. రాజకుమారికూడా ఒక పాత్ర ధరిస్తున్నది.

ఇప్పటికి తొమ్మిది రీళ్ళు 'చుట్టబడిన' ఈ చిత్రానికి (నూతన) దర్శకుడు—ఐ. ఎన్. మూర్తి, శైలజానందముఖర్జీ ( వంగ ) కథను ఆధారంగా కొండేపూడి లక్ష్మీనారాయణ సంభాషణలు రచించారు. ఆరుద్ర, కొసరాజు పాటలు రాశారు; సంగీతదర్శకుడు: వేణు; నృత్యం : సత్యం, కళ : వాలి; ఎడిటర్ : ఎం. ఎస్. మణి; మేకప్ చౌదరి; ఫొటోగ్రఫీ : ఆదీ ఇరానీ, మల్లీఇరానీ; నిర్మాణ నిర్వహణ : జి. వి. కృష్ణ.

# కౌసల్యావారి "నువ్వా? నేనా?"

ఆ రాజ్యంలో, ఆనవాయితీ ప్రకారం ఆసంవత్సరం కూడా విజయదశమి వేడుకలు జరుపుతున్నారు. బహిరంగమైదానం. చుట్టూ జనం కూచునివున్నారు. ఒకప్రక్కన ఎత్తుగా వేదిక అందంగా అలంకరించబడివుంది. వేదికపైన చిన్నాపురం జమీందారిణి రాజ్యలక్ష్మి కూచునివున్నది. ఆమెకు చెరోప్రక్కా ప్రతాపూ, ఆనందూ కూచునివున్నారు. ప్రతాప్ ఆరాజ్యానికి జమీందారు పక్కసంస్థానం ఏల్తున్న జమీందారిణి రాజ్యలక్ష్మి. ఆనంద్ ప్రతాప్ స్నేహితుడు, వీరుడు. ఈ వేడుకల్లోని అంశాలు ఏమిటంటే వివిధ సాహస కార్యాలలోనూ పోటీలు. ఆపోటీలు ప్రారంభం కాబోయేముందు, జమీందారు ప్రతాప్ లేచి నించుని— "సభాసదులకు మా శుభాకాంక్షలు ఇన్ని సంవత్సరాలుగా యీ వేడుకలు మనం జరిపిస్తున్నాము కాని ఎన్నడూలేని ఒక కొత్తశోభ యీ

సంవత్సరం ప్రవేశించింది ఆదేమిటంటే చిన్నాపురం జమీందారిణి, సౌభాగ్యవతి రాజ్యలక్ష్మి దేవిగారి సమక్షంలో జరగాలి!" అని గంగారాం ప్రసంగాన్ని ముగించాడు. ప్రజలంతా ఆనందంగా చప్పట్లు కొట్టారు. రాజ్యలక్ష్మి లేచి— "మహాజనులారా! మీ అందరినీ కలుసుకొనే యీ అవకాశం కలిగించినందుకు మీ ప్రభువారికి నాహృదయపూర్వక ధన్యవాదాలు. ఎన్నడూలేని క్రొత్త శోభ మావల్ల వచ్చిందని వారన్నారుగాని, ఎక్కడా చూడని ఒక చక్కని సంప్రదాయాన్ని మీ ప్రభువులు స్థాపించారు. పాలించే ప్రభువుకూడా ప్రజలలో ఒకరై పోటీలో పాల్గొనడం ఆశ్చర్యం! అదే విశ్వశోభాయమానంగా వుంటుందని నిశ్చయంగా చెప్పవచ్చు!" అన్నది. ప్రజలంతా కరతాళధ్వనులు చేశారు.

పోటీలు ప్రారంభమైనాయి. అన్నిటిలోనూ ఆనందే ప్రథమస్థానం పొందుతున్నాడు. చివరకు తుపాకీపోటీ జరిగింది. అందులో ప్రాణమిత్రులైన ప్రతాప్, ఆనంద్‌లు పాల్గొన్నారు. ఇందులోనూ ఆనందే గెలిచాడు. ప్రజలంతా మహోత్సాహంతో, మిన్నుముట్టే కరతాళధ్వనులు, హర్షధ్వానాలూ చేశారు. అమితానందంతో ప్రతాప్ ఇట్లా ఉపన్యసించాడు— "మహాజనులారా! ఇన్నాళ్లకు తుపాకీ పోటీలో నన్నుమించిన వీరుడు దొరికాడు. అతడెవరో కాదు— నా ప్రాణమిత్రుడు ఆనందే! మాయిద్దర్లో ఎవరుగెలిచినా ఒకటే 'అని' 'ఆనంద్‌కూ' అన్నాడు. ప్రజలంతా జయజయధ్వానాలు చేశారు!

అన్నిటిలోనూ ఆనందే ముందంజవెయ్యటం రాజ్యలక్ష్మికి ఆశ్చర్యంకలిగించింది. అంతేకాదు, ఆమె పరవశురాలైంది. ఆ పరవశత్వంలోనే లేచి వినమని— "మహాజనులారా! వేడుకలెంతో వైభవంగా జరిగాయి. పోటీలలో పాల్గొన్న ఆనంద్ తన అసమాన నైపుణ్యాన్ని ప్రదర్శించి నాహృదయాన్ని" అని ఆమె తడబడింది. అంతలోనే సర్దుకుని— "మన అందరి హృదయాలనూ దోచుకున్నాడు. ఇటువంటి వీరుడికి నాచేతులతో బహుమతిని అందజెయ్యటం మహాభాగ్యంగా భావిస్తున్నాను" అని—చాలా గోముగా ఆనంద్‌ను పిలిచింది. వేదికపైకి ఆనంద్ వచ్చాడు. రాజ్యలక్ష్మి పరవశంతోనే, సిగ్గుపడుతూ అతనికి బహుమానం అందజేసింది. ప్రజలంతా కరతాళధ్వనులు చేశారు.

ఆవిధంగా హీరోపై ప్రేమ అంకురించిన రాజ్యలక్ష్మికి, కథ ఏవిధంగా సహాయపడింది? అసలు సహాయపడిందా, లేదా? ఆమె ప్రేమను ఆనంద్ స్వీకరించాడా? ఈ ఉత్సవంలో పాల్గొన్న ప్రజలమధ్య 'చిత్రనాయిక' కూడా వున్నది కాబట్టి— ఆమె అనుభూతి ఏమిటి?—చివరకు ఆనంద్ ఎవర్ని వివాహమాడతాడు? (న్యాయంగా నాయికనే ఆడతాడు) ఇటువంటి ప్రశ్నలన్నింటికీ వెండితెర సమాధానం ఇస్తుంది!



'రక్తసంబంధం' సెట్టుమీద సూర్యకాంతం, వి. మధుసూదనరావు, సి. నాగేశ్వరరావు, సావిత్రి, దేవిక వగైరా. ఫోటో: రూప.

కౌసల్యప్రొడక్షన్స్‌వారు తెలుగు తమిళ భాషలలో నిర్మిస్తున్న (తమిళంలో పేరు నీయా ? నానా?) ఈ చిత్రంలో ఆనంద్‌గా కాంతారావు, ప్రతాప్‌గా రాజనాల, రాజ్యలక్ష్మిగా రాజశ్రీ, 'నాయిక'గా దేవిక నటిస్తున్నారు. వీరుకాక, కన్నాంబ, రాధాకుమారి, బాలాకుమారి, బాలకృష్ణ, సత్యనారాయణ, వై. వి. రాజు, వి. వి. సుబ్బారావు (జా), పేకేటి, మున్నగువారుకూడా నటిస్తున్నారు. ఆరుద్ర ఈ చిత్రానికి పాటలూ, మాటలూ వ్రాశారు. 'మంచిమనసులు'కి సంగీతమిచ్చిన కె. వి. మహదేవన్— సంగీత దర్శకుడు. కళ గోడ్‌గాంకర్, కెమెరా జాగీర్దార్, స్టంట్స్ స్వామినాథన్, దర్శకుడు ఆమంచర్ల శేషగిరిరావు, నిర్మాతలు భావనారాయణ, బాలకృష్ణరాజన్.

ఇంకో రెండు కాల్ షీట్లపనితో పూర్తికానున్న ఈ చిత్రం త్వరలో పూర్ణావారిద్వారా విడుదలవుతుంది.

—'మ'





విఠల్ ప్రొడక్షన్స్‌వారి 'మదనకామరాజు కథ'లో అనూరాధ, మీనాకుమారి.

# మనమూ-మన దేహస్థితీ

13వ పేజీ తరువాయి

ఉత్పన్నమైన ఆహారలోపములవల్ల ఏర్పడ్డది కాదు. గర్భాశయంమీద, దానికిపోయే రక్తనాళములమీద మనస్సుకున్న ప్రభావంవల్లనే ఈలక్షణంఏర్పడుతుంది. రోగి పూర్వాహారం తీసుకున్న తరవాత కూడా కొన్ని మాసాలవరకు బహిష్ఠ కావడం జరగదు. మనస్సుకు శరీరంమీద ఎంత కంట్రోలు ఉన్నదో పై విషయం వ్యక్తం చేస్తుంది. ఇల్లాగే సంతానవాంఛతో మతిభ్రంశం పొందిన కొందరు స్త్రీలకు గర్భవతులు కాకుండానే తాము గర్భవతులమనే భావన బలవత్తరంగా ఏర్పడుతుంది. వారి గర్భం పెద్దదౌతుంది పాలు ఏర్పడతవి. ఇతర గర్భచిహ్నములన్నీ ఏర్పడతవి కాని ప్రసవమంటూ జరగదు. ఒకసారి మైకం ఇస్తే అన్నీ క్షణంలో అంతరించిపోతవి ఈ స్థితిని కృత్రిమగర్భము (Pseudo Pregnancy) అంటారు ఇది జంతువులలో చాలా తరుచుగా కనుపిస్తుంది సకాలంలో బహిష్ఠ కాకపోవడం, గర్భధారణకు చిహ్నమని అందరికీ తెలుసు అందువల్ల బహిష్ఠకావడం నిలిచిపోగానే, స్త్రీ గర్భవతినని విశ్వాసం ఏర్పరచుకుంటుంది మానసిక కారణములచేత ఆకలి ఎండిపోవడం, సాధారణంగా గ్రాడ్యుయేట్లని విలసింపబడి, తీవ్రమయిన మనోవ్యథలకు గురిఅయిన స్త్రీలలో సాధారణంగా ఏర్పడుతూ ఉంటుంది.

వైరిః క్షుద్రాహిత్యం దీర్ఘమైనప్పుడు, ఒకరకమైన విపర్ణమైన దేహవృద్ధి ఏర్పడుతుంది. లోపభూయిష్ఠమైన ఆహారం, అంతకన్నా లోపభూయిష్ఠమైన ఆహారాహరణము (Absorption of food) ఇందుకు కారణములు కావచ్చు. ఎందుకంటే ఈ స్థితి సాధారణంగా క్షామకాలములలో కనుపిస్తూ ఉంటుంది. కాని చిత్రమేమిటంటే, ఇంత జరిగినా విటమిన్లలోపంవల్ల ఏర్పడే లక్షణములు ఈ వ్యాధిలో ఎప్పుడో గాని కనుపించవు. ఈ రోగుల టెంపరేచరు నార్మల్‌గానే (98 4°) ఉంటుంది. హృదయమూ నాడీ (Pulse) మామూలుగానే ఉంటుంది ఒరం రసములలో లోపమేమీ ఉండదు మూత్రంలోనూ దోషం కనుపించదు. కాని శరీరాంతములూ, ముక్కూ, చెవులూ చల్లగావుండి, వాటిలో నీలిమ ఏర్పడుతుంది. తగినంత రక్తం ఆ ప్రదేశములకు పోక ఈ స్థితి ఏర్పడుతుంది. ఆక్సిజను తగినంతగా లేకపోతే శరీరభాగములు నల్లబడతవి. మనస్సుకు కష్టంకలిగినప్పుడల్లా మూర్ఛావస్థలోపడి, నిముషంలో నఖశిఖపర్యంతమూ నల్లబడిపోయిన హిస్టీరియారోగు లున్నారు. వీరిలో చర్మం మార్దవం నశించి బెరడుగట్టి, పొట్టురాలిపోతూ ఉంటుంది

త్వరలో తగినచికిత్స లభించకపోతే, కేవలం విశ్రాంతివల్ల, నిరాహారంవల్ల శరీరభాగములు ఇలకరుచుకునిపోయి (Atrophy) మరణం సంభవిస్తుంది. మరణానంతర పరీక్ష (Post — Mortem Examination) లో వారి శరీరాంతర్భాగములలోవున్న అంగములలో ఏ లోటూ దోషమూ కనుపించదు!

చికిత్స—ప్రారంభదశ దాటిపోయినప్పుడు రోగిని వేరే ప్రదేశానికి పంపి, ఎరిగిన బంధుమిత్రులను కొన్నాళ్లదాకా కనపడకుండా చేయాలి. ఈరకం రోగుల్లో అన్నహితవు నశించినా, జీవితంలో ఇతర విషయములమీద—సాధారణంగా పిల్లలూ, చెట్లూ, పెంపుడు జంతువులు—వీటిలో వేటిమీదనయినా మమకారం మిగిలివుంటే, దానిని పురస్కరించుకుని రోగికి జీవితంమీద అభిరుచి పెంపొందించి, ఆహారం తీసుకోకపోతే, అవన్నీ పాడయిపోతవని నచ్చచెప్పి అన్నహితవు కల్పించవచ్చును. మొదట్లో నిరాకరించినా, రోగి క్రమంగా ఆహారం తీసుకోవచ్చును. మొదట్లో డాక్టరు—రోగికి గౌరవమూ, విశ్వాసమూ ఉన్న డాక్టరు—దగ్గర ఉండి, తినిపించాలి. తరవాత అటువంటి నర్సుకే రోగి సంరక్షణం వదలవచ్చును. రోగి సరేనన్నంతమాత్రాన ఆహారం ఇచ్చి వెళ్ళిపోగూడదు. నచ్చజెప్పినందున వైఖరి మారినా, వాళ్లదారిన వాళ్లని వదలినప్పుడు, రోగుల్లో పాతవిరక్తి తలెత్తి ఆహారం తోసేస్తారు. మొదట్లో ఏ ఆర్థిక, సాంఘిక, మానసిక వైపరీత్యములవల్ల ఈ స్థితి ఏర్పడిందో ఆ విషయాలు చర్చించరాదు. కొంత అభివృద్ధి ఏర్పడినతరవాత, పెద్ద ఆడంబరములులేని మాటలతో రోగికి ఆహారావసరమును గురించి నచ్చజెప్పి, దారికి తీసుకురావాలి. ఎక్కడోగాని, మానసిక వైద్యనిపుణులవల్ల ప్రత్యేక చికిత్స అవసరంకాదు రోగి సన్నిహితబంధువులనూ, స్నేహితులనూ కలుసుకుని, రోగారంభకారణములను తెలుసుకొని, తదుచితమైన రీతిగా చికిత్స చేయాలి. ఈ వ్యాధి నివారణచేసేవారికి చాలా ఓర్పూ, మానవత్వం, దయాంతఃకరణం, సమర్థత, అవసరం. రోగం నయమై, రోగి ఇంటికిపోయినతరవాత అందుకు కారణమైనవారు పశ్చాత్తాపంతోనో, అప్రతిష్ఠ అనే భయంతోనో అతి ఆందోళన ప్రదర్శించరాదు. అటువంటి దేదీ జరగనట్లే మామూలు అపేక్షతో మసలుకోవాలి ప్రత్యేకాహారాలు, వినాళికాగ్రంథి సారాలూ, ఇతర ఔషధములు మానసికకారణాలవల్ల ఆకలి నశించినవారిలో ఆకలి కలిగించవు. ఈ దయనీయస్థితిలో రోగికి, రోగివిషయంలో చూపించవలసిన సానుభూతి కూడా మొదట్లో లభించదు. ఈ రోగచికిత్సలో మంచిమాటలే మందులు. మనస్సును గాయపెట్టడం మంచిదికాదనే వివేకం అవసరం. కాని, ఆశలు పెరిగిపోతూ, అవకాశాలు తరిగిపోతూ, ఆడంబరాలు రాజ్యం చేస్తూ, కర్మ సిద్ధాంతంలో విశ్వాసం నశించిపోతూ, అహంకారం అధికమై మాటమాటకూ మనస్సులు మరిగిపోయే ఆధునికజీవితంలో ఈస్థితి వెనకటంత సకృత్తుగాలేదు. విధివల్ల కలిగే లోపాలకు వ్యక్తుల్ని నిందించడంవల్ల సమస్యా పూర్తి కాకపోగా, రోగం కలిగించడం, రోగం తెచ్చుకోడం మాత్రమే సంభవమవుతుందని, తమ మనస్సులు చాలా సున్నితమైనవని గర్వించేవారు తెలుసుకోవాలి. ఏమన్నా ఏం జరిగినా తుడిచివేసుకుపోయేవారిలో ఈస్థితి ఏర్పడదు.

ఆకలి, శరీరంలో ఆహారము అవసరమైనప్పుడు మానసికంగా ఏర్పడే అనుభూతి. ఆహారం వున్నా, కడుపులో జీర్ణరసంవున్నా ఆకలి కావడమనేది మనస్సునుంచి కలగవలసిందే.

కడుపులో స్థానికములైన మార్పులవల్లకూడా ఆకలి మందగించవచ్చును. జీర్ణరసం ఉత్పత్తి తగ్గినప్పుడు ఆ రసమును ఉత్పత్తిచేసే గ్రంథులకు మెదడునుండి ఆదేశములు సరిగా రానప్పుడు ఆకలి కాదు. తిక్తపదార్థములు (చాలా చేదుగావుండే పదార్థములు Bitters) ఈ గ్రంథులను ఉద్రేకింపజేసి జీర్ణ రసమును ఉత్పత్తిచేసేటట్లు ప్రేరేపిస్తవి. 'ఏసిడ్'లను రూపుమాపే (Neutralise) సోడియం బైకార్బొనేట్‌వంటి క్షారవస్తువులు చిన్న మోతాదులలో జీర్ణరసం ఉత్పత్తిని అధికం చేస్తవి. క్వినిన్ (Quinin), నక్సువామికా (Nuxvomika), క్వాషియా (Quassia), జెన్షియన్ (Gentiin) మొదలయిన పదార్థములు, ఆహారం తీసుకుంటానికి కొంచెం ముందుగా తీసుకుంటే జీర్ణరసం ఉత్పత్తి అవుతుంది. కోడిరుసా (Soup) సారాయము ద్రాక్షాసవము కొద్ది మోతాదులలో ఆకలిని పుట్టిస్తుంది. అజీర్ణంవల్ల ఆకలి చెడినప్పుడు జీర్ణకరములైన ఔషధములు తీసుకోవాలి. టాకాడయాస్టేజ్ (Takadiastage), కేరిపెప్టిక్ లిక్విడు (Caripeptic liquid), పెప్సిన్ (Pepsin) పేంక్రియస్ (గంధిసారము పెస్టైల్ మాత్రలు) భోజనానంతరం తీసుకుంటే జీర్ణవృద్ధి జరుగుతుంది. కొద్దిరోజులలో మందగించిన ఆకలి మామూలుస్థితికి రాకపోతే తగిన వైద్యసహాయం పొందడం అత్యవసరం. కడుపులో కేన్సరు, క్షయవ్యాధుల ఆరంభదశలో ఆకలి మందగించడం ప్రారంభ లక్షణము అని మరువరాదు. 

ఈ హోటల్‌లో మకాం చేస్తున్న పెద్దమనిషి మేనేజర్‌తో ఇలా అంటున్నాడు: "మా ఆవిడ గంట క్రితమే రావలసింది. మార్కెట్టెవరైనా దారితప్పించారో; కారు క్రిందపడిందో; లేక ఏవన్నా కొనడానికే వెళ్ళిందో తెలియటం లేదు. భగవంతుని దయవల్ల ఆమె ఏవీ కొనడానికి వెళ్ళి ఉండకపోతే బాగుణ్ణు"

కె. ఆదిశేషయ్య (నిశ్రంబోలు)

# విశాల నేత్రాలు

9-వ పేజీ తరువాయి

'వాడలో వాళ్ళంతా పని గానిపాటే గాని ఇంకొక గొడవే పట్టించుకోరు!' అని కొనగోళ్ళతో కోర మీసాలు సవరించుకొన్నాడు. తోతోపరినించి ఉప్పొంగుతున్న అక్కసుతో మేళవించిన చిరునవ్వు అలవోకగా అతని పెదవిమీద తరళించింది. మరి కొంతసేపటి వరకు వారిద్దరు ఏదో లోకాభిరామాయణంలో పడ్డారు. రెడ్డి బాగా పరధ్యానంగా ప్రసంగిస్తున్నాడు. కాని పైపై కది బయటపడ నీయలేదు. ఈవేళ ఎదురువీథిలో అతని పనిచక్కడ లేదనీ, ముళ్ళమీద నిలుచున్నట్టున్నాడనీ మాణిక్యవల్లి కనిపెట్టడానికెంతోసేపు పట్టలేదు.

అలాగ మరికొంతసేపు గడిచిన తరువాత రెడ్డి హఠాత్తుగా ఏదో జ్ఞాపకం వచ్చినట్లు అదిరిపడి లేచి నిలుచున్నాడు. మాణిక్యవల్లి ఆ వింతగోరణి గమనించి ఆశ్చర్యపడి, చెయ్యి దొరకబుచ్చుకుని ఎంతో అనునయంతో 'ఎక్కడికి ?' అన్నట్లు బొమముడి విరిచింది. రెడ్డి కొంచెం విసురుగా ఆమె పట్టు విడిపించుకొని నెమ్మదిగా ప్రతిమాలుకొన్నాడు :

'అన్నట్లు మాటల సందడిలో పడి మర్చిపోయాను మాణిక్యవల్లీ! ఈవేళ రాత్రి తలవరి మా భవంతికి వస్తానన్నాడు. ఇంతకుముందే అక్కడికి వచ్చి నాకోసం ఎదురుతెన్నులు చూస్తున్నాడు కాబోలును! మరి నేను వెళ్ళాలి'

'ఇంత అపరాత్రివేళ అంత పుట్టి మునిగిపోయే రాచకార్యం ఏమి వచ్చింది ?'

'నిలుచున్నపాటుగా అతనితో ఒక వ్యవహారం సంప్రతించాలి'

'అదేదో నేను కొంచెం వినకూడదా ? ఇంతలోనే పరాయిదాన్నయిపోయానా ? పోనీలెండి !'

మాణిక్యవల్లి రుసరుస లాడుతూ మూతి ముడుచుకుని కూర్చుంది.

'రేపు వచ్చినప్పుడు అంతా సావకాశంగా చెబుతాగా ! ఇక క్షణకాలం కూడా వ్యవధిలేదు ! నన్ను పోనీ, నేను వెళ్ళాలి'

అలాగ ఎంతో ఆప్యాయంగా బ్రతిమాలుకుని తిరుమలరెడ్డి తొందర తొందరగా అడుగులు వేసుకుంటూ ఆ భవంతి సింహద్వారం సమీపించాడు. మాణిక్యవల్లి సత్వర గమనంతో వెంటాడించి ఏదో చెప్పబోయింది కాని, అంతలోనే అతడు తలుపులు తెరుచుకుని రాజవీథిలో పడి అదృశ్యుడయ్యాడు ! ఆమె మరికొంత సేపటికి వరకు నోట మాట వెలువడక వీథి గుమ్మంలో కేవలం శిలామూర్తిలా నిలబడింది. తటాలున తలుపులు బిగించి, నీరసంగా నిట్టూర్చి తిరిగివచ్చి తన పడకగదిలో పందిరి పట్టెమంచంమీద కూలబడింది. ఎంతగా ప్రయత్నించినా తెలతెల్లవారేవరకూ ఆమెకంటి కొక్క కునుకయినా పట్టలేదు.

తిరుమలరెడ్డి అపరాత్రివేళ అలాగ నిలుచున్నపాటుగా తన భవంతికి తరలిపోవడాని కేమి కారణమో ఎంతగా ఆలోచించినా ఆమె కవగతం కాలేదు. నిజంగా తలవరితో మాట్లాడడం కోసమే ఆయన తన భవంతికి తరలిపోయినాడా ? కాకపోతే ఇంకొక

# సాంగత్యమే సర్వస్వమూ



## బ్రౌన్ & పోల్సన్ కస్టర్డ్ మీ భోజనానికి పరిపూర్ణత్వం






బ్రౌన్ & పోల్సన్ కస్టర్డ్ మెత్తగా...మీగడలా. ఎంతో రుచిగా వుంటుంది టార్ట్‌లూ, జెల్లీలూ, కేకులూ, పుడ్డింగ్, పేస్ట్రీలూ, మరింత రుచిగా, మరింత ఆకర్షణీయంగా వుంటాయి కస్టర్డ్‌తో. బ్రౌన్ & పోల్సన్ కస్టర్డ్ పౌడర్ నుంచి పుడ్డింగుల కోసం మామూలు కస్టర్డ్ లభిస్తుంది. లేకపోతే బ్రౌన్ & పోల్సన్ వెరైటీ కస్టర్డ్ పౌడరు నుంచి మీ మనసుకు నచ్చిన రుచిని ఎంచుకోవచ్చు. 6 రుచికరమైన రకాలను మీకోసం ఒక పెట్టెలోనే భద్రపరిచాము — ఆరెంజ్, బనానా, స్ట్రాబెర్రీ, లెమన్, రాస్‌బెర్రీ, వెనీలా. ఈ రెండు కస్టర్డ్ పౌడర్లలోనూ కోడి గుడ్డు లేదు. బ్రౌన్ & పోల్సన్ కస్టర్డ్ పౌడర్: 1 పౌ॥ మరియు 7 పౌ॥ డబ్బాలలో దొరుకుతుంది. బ్రౌన్ & పోల్సన్ వెరైటీ కస్టర్డ్ పౌడర్లు. 6 పైంట్ పాకెట్లలో దొరుకుతాయి.

**కార్న్ ప్రాడెక్ట్సు కం (ఇండియా) ప్రైవేట్ లి.**

**ఉచితము** ఈ కూపను నింపి దీనితో కూడా బ్రౌన్ & పోల్సన్ ప్లావర్డ్ కార్న్‌ఫ్లోర్ లేక వెరైటీ కస్టర్డ్ పౌడర్ పేకెట్ నుంచి 5 లోపలి సంచులు పంపితే, మీకు రకరకాల వంటకాలు ఎలా చేయవచ్చో తెలిపే పుస్తకం పంపుతాము. ఈ పుస్తకం ఇంగ్లీషు, హిందీ, తమిళం, తెలుగు, గుజరాతీ, మలయాళం, ఉర్దూ, బెంగాళీ, మరాఠీ భాషలలో దొరుకుతుంది. (అక్కర లేని భాషలను కొట్టివేయండి)

శ్రీ /శ్రీమతి /కుమారి..............................................
...............................................................
చిరునామా..............................................
...............................................................

డిపార్టుమెంట్ నెంబరు. APW-14

కార్న్ ప్రొడెక్ట్సు కంపెనీ (ఇండియా) ప్రైవేట్ లి.
పో బా. 994, బొంబాయి–1
ఈ ప్రకటన కేవలం భారతదేశానికే వర్తిస్తుంది

వ్యవహారం ఏమయి ఉంటుంది ? రెడ్డి చూచాయగా నయినా అది తనతో చెప్పకపోవడానికి కేమి కారణము! ఒకవేళ తలవరితో మాట్లాడడమే నిజమయితే వారి కిప్పు డంత అతి రహస్యంగా ఒకరొకరి చెవి కొరుక్కోవలసినంత తొందర ఏమి వచ్చింది.? అది రంగనాయకునికి సంబంధించిన వ్యవహారమే అయితే సూచనగా నయినా తనతో చెప్పి ఉండవచ్చునే! మరి ఎందుకు చెప్పలేదు. తమ కుటుంబంమీద లేనిపోని బెడద ఏది విరుచుకు పడకుండా ఆ వ్యవహారం అంతా నిమ్మకి నీరెత్తినట్టు పరిష్కారం చేయవలసినదని సలహా యిచ్చినది తానే కదా! అయినా రెడ్డి తనతో ఆమాటే ప్రస్తావించక పోవడంలో గల అంతరార్థం ఏమయి ఉంటుంది ? అవిధంగా అనేక విధాల మథనపడిన తరువాత, ఏదో వేరొక వ్యవహారంమీద తలవరితో మంత్రాంగం కొనసాగించడానికని రెడ్డి అంత తొందరగా తన దగ్గిర నించి బయలుదేరి ఉండవచ్చునని అనుకొని మాణిక్యవల్లి లోలోపల కొంతవరకు సమాధానపడింది. కాని చిట్టచివరి కది కూడా పూర్తిగా సంతృప్తి కలిగించలేదు. ఆమె చాలాసేపటివరకు అలాగే గుంజాటనపడి, బాగా అలిసిపోయి బళ్లుమని తెల్లవారిన తరవాత ఒళ్లెరగని బడలికతో ఆదమరచి నిద్రించింది.

## 6

తలవరితో అతి రహస్యంగా మాట్లాడాలని చెప్పి రెడ్డి శీఘ్రంగా తన భవంతికి చేరుకొన్నాడు. కాని నిజానికి తలవరి అక్కడికి వస్తాననలేదు. ఆ అపరాత్రివేళ అతనితో సంప్రతించాలని కూడా రెడ్డి తలపెట్టలేదు. అది వట్టి అభూతకల్పన. రంగనాయకుని వ్యవహారం విన్నప్పటినించి అతని కిక వూపిరే ఆడలేదు! ఆపైన ఇక ఒక క్షణమయినా అక్కడ నిలబడలేక అతడా మిషమీద తన భవంతికి తిరిగివచ్చాడు. కాని తలవరితో సంప్రతించాలని అతని అంతరాంతరంలో ఒక ఆలోచన బయలు దేరకపోలేదు. శయ్యమీద మేను వాల్చిన తరవాత అనేకవిధాలయిన ఆందోళనలతో అతనికా రాత్రివేళ చాలాసేపటివరకు ఒక్క కునుకయినా పట్టలేదు తిరిగి పానుపుదిగి బోనులో పెట్టిన పులిలాగ అదే పనిగా అటు యిటు పచార్లు ప్రారంభించాడు.

తెల్లవారిన తరవాత మరి వేచి ఉండలేక ఆదరాబాదరాగా స్నానాదికం ముగించుకొని తిన్నగా తలవరి భవంతివైపు సాగిపోయాడు. అత డల్లంత దూరంలో రెడ్డి రాక గమనించి సగౌరవంగా ఎదురుగా వచ్చి తన సౌధం మీదికి తోడుకుపోయి ఏదో పిచ్చాపాటి ప్రారంభించాడు ఆ సంభాషణ అలాగ మరికొంతసేపు కొనసాగింది. అయినా రెడ్డి తన వ్యవహారం బయటపెట్టలేదు. మరి ఉండబట్టలేక తలవరి ప్రశ్నించాడు.

'ఏదో పెద్ద పని లేకపోతే మీలాంటివారు మా భవంతికి విజయం చేస్తారా ? ఏమిటి విశేషం ?'

రెడ్డి తలవరికి బాగా దగ్గరగా జరిగి 'అంత పెద్ద విశేషం ఏమి లేదు గాని ఆ దొంగ సంగతి

తెలిసింది.' అన్నాడు అతి రహస్యంగా

కాని తలవరి దాని కంతగా ఆశ్చర్యపడలేదు. 'మీవంటివారు తలపెట్టినప్పుడది తెలియకేం జేస్తుంది! ఇంతకీ ఎవడా దుస్సాహసి ?'

తిరుమలరెడ్డి సంగ్రహంగా రంగనాయకుని వ్యవహారం వెల్లడించాడు. కాని అసలు రహస్యం మాత్రం బయటపెట్టలేదు సొమ్ము దొంగిలించాలన్న దుర్బుద్ధితోనే అత డంతటి చెడ్డపని తలపెట్టినట్టు ఒక కట్టుకథ కల్పించాడు. కాని అది అంతగా అతకలేదు కనకనే తలవరికా గాథ పూర్తి సంతృప్తి కల్పించలేదు. కొంచెం తటపటాయిస్తూ మళ్లీ అడిగాడు

'సరేగాని ఆ దొంగ రంగనాయకుడే అని మీ కెలాగ తెలిసింది ?'

'కావలివా డొకడు అతగాణ్ణి బాగా గుర్తుపట్టి ఆ సంగతి నా చెవిని వేశాడు'

'హోహో! అలాగా!' అన్నాడు తలవరి ఆపైన మరి రంగనాయకుని మాటే తలపెట్టలేదు! ఏదో ఇంకొక సంగతి ప్రస్తావించబోయాడు తిరుమలరెడ్డి కొంచెం విసుగుదలతో 'మరి ఈ సంగతి ఏమి చేదామనుకుంటున్నారు ? ఇద్దరు ముగ్గురు కావలివాళ్ల ఒళ్లు హూనంచేసి అచ్చుపోసిన ఆంబోతులా తిరుగుతున్నాడు వాడు! మీరు కొంచెం గట్టిగా కలగజేసుకుంటేనేగాని వాడి తల పొగరణగదు!' అని తన లోలోపలి అక్కసు కొంత పైకి వెళ్లగక్కి ఏకాగ్రదృష్టితో అతని ప్రత్యుత్తరం కోసం నిరీక్షించాడు

అయినా తలవరి ప్రత్యుత్తరం ప్రారంభించలేదు. ఏదో దీర్ఘాలోచనలో పడ్డాడు. మరి వేచి ఉండలేక కోరమీసం చిటికెనవేలితో సరిదిద్దుకుని రెడ్డి మళ్లీ అందుకున్నాడు

'ఈవేళ ఇది అవుతుంది! రేపు ఇంకొకటి అవుతుంది! దేనికయినా ఒక హద్దు పద్దు ఉండాలి న్యాయాన్యాయాలొక కంట కనిపెట్టి చూడవలసినవారు మీరే మారి చూడనట్టు మాట్లాడకూరుకుంటే ఎలాగ ? ఇక ఈ పట్టణంలో ఆలనపాలనలేక అయినవాళ్లు, కానివాళ్లు బరితెగించిపోరా ? ఇంతకుమును పెప్పుడయినా ఈ రాజ్యంలో ఇలాంటి దురన్యాయాలు జరిగాయా ?—'

అంతలోనే తలవరి అకస్మాత్తుగా అతని ధోరణి కడ్డుతగిలి ప్రశాంత స్వరంతో ప్రసంగించాడు

'అవును మీరన్నది నిజమే! కాదని ఎవరన్నారు? మొట్టమొదట ఈ దొంగతనం లంతేమో కనుక్కొని తీరాలని ఇది మీ చెవిని వేసినది నేనేకదా ? అయితే మనం తొందరపడి కాళ్లు, చేతులు విరగదొక్కుకుంటే ఎలాగ ? వెంకటనాయకుడు నలుగురిలోను తగుదునని తల ఎత్తుకు తిరుగుతున్న పెద్దమనిషి. ఇన్నాళ్ల నించి ఇంకొకరి గోడే తలపెట్టక ఎంతో మర్యాదగా గుట్టుగా కాలక్షేపం చేస్తున్నాడు. చాలాకాలంనించి నే నతనిని బాగా ఎరుగుదును. ఇక రంగనాయకుని సంగతి ఇంతకుమును పెన్నడు అత డిటువంటి చెడ్డపనుల జోలికి

పోలేదు. మీరేమో నగలు, నాణ్యాలు చేజిక్కించుక పోవడానికే అత డింతటి దొంగతనం తలపెట్టి నట్టు మాట్లాడుతున్నారు !'

"నేను ఒక్కణ్ణే కాదు ! కావలివాళ్లు, ఇరుగు పొరుగు పెద్దమనుష్యులు అందరూ అదే మాట అంటున్నారు !" అన్నాడు రెడ్డి మరికొంత విసుగు దలతో.

తలవరి మళ్లీ మొదలుపెట్టాడు.

'అలాగా ! .... నేను మీరన్నది కాదనడంలేదు. అయితే ఒక్క విషయం ఉన్నది ఉన్నట్టు మాట్లాడుతున్నాను. అన్యథా భావించకండి ! అది సంసారుల భవంతి కాదుగదా ! అనేకు లనేక విధాలా శృంగారమంజరి ఇంటికి వస్తూ పోతూంటారు. అలాంటప్పుడు రంగనాయకుడు దొంగతనం చెయ్యడం కోసమే అంతపని చేశాడని నిర్ణయించడ మెలాగ ? తీగ లాగితే డొంకంతా కదులుతుంది. ఇది మన దండనాయకుల చెవిని పడితే, ముందు మీ పరువు నలుగురి పెద్దమనుషుల నోళ్ల లోను పడి నలిగి తీరుతుంది. ఊరికే ఉత్త పుణ్యాని కెందుకింత రభస ! నామాట విని కొంచెం తనూాయించి జాగ్రత్తగా ఆలోచించండి !'

'అయితే దొంగ యింటిలో జొరబడి కావలి వాళ్ల నందరిని చావగొట్టి, తన దారిని తాను పారిపోతే, కుక్కిన పేనులాగ నోరు మూసుకుని మాట్లాడ కూరుకోమన్నారా ? ఇదెక్కడి దుర న్యాయం ?' రెడ్డి కఠోరస్వరంతో గర్జించాడు.

అయినా తలవరి తొందరపడలేదు.

'నే నేమి మాట్లాడ కూరుకోమని చెప్పడంలేదు అన్యాయంగా నామీద నింద వెయ్యకండి ! కావ లిస్తే యిప్పుడే వెళ్ళి మన దండనాయకుల సమ క్షంలో నడిచిన వ్యవహారం యావత్తు పూసగుచ్చి నట్టు నివేదిస్తాను. అంతేగాని స్వతంత్రించి నేనై ఈ గొడవలో దిగదలుచుకోలేదు ఆపైన వచ్చే కష్ట నిష్ఠురా లన్నిటికి మీదే పూచీ ! మరి నన్నే మన్నా ప్రయోజనంలేదు. శృంగారమంజరి కుటుం బంతోబాటు మీ పేరు కూడా బాగా రచ్చ కుక్కుతుంది ఇది మీ మేలుకోరి చెబుతున్నమాట ! బాగా ఆలోచించండి. మరి నాకేమిటి సెలవు! వెంటనే దండనాయకుల భవంతికి బయలుదేర మంటారా ?'

ఆ ప్రశ్నతో తిరుమలరెడ్డి ఆవేశం బాగా చల్ల బడింది. మొట్టమొదట కొండంత ఆశతో అక్క డికి వచ్చాడు. తలవరివల్ల రంగనాయకునికి కారా గార ప్రవేశం తప్పదనుకొన్నాడు కాని కథ అడ్డం తిరిగింది వెంకటనాయకునితో అతనికి అంత సన్ని హిత పరిచయం ఉన్నదని రెడ్డి కేమాత్రము తెలియ లేదు పైగా కొంచెం దూరపు చుట్టరికం కూడా ఉండవచ్చును తలవరికి గొంతులో పచ్చి వెలక్కాయ చిక్కుకొన్నట్టయింది కాని లోలోపలి అక్కసు మాత్రం రాజుకుంటూనే ఉంది అయినా మరి వేరే గత్యంతరం స్ఫురించలేదు. అంతలోనే తలవరి రవంత అనునయధోరణితో ఆ విషయమై తన అభిప్రాయం వెల్లడించాడు.

'ఇంకొక్కమాట ! రంగనాయకు డింకా ముక్కుపచ్చలారని పసివాడు. ఇదిగాని తండ్రి చెవిని పడిందంటే అతడిక శృంగారమంజరి వీధి గుమ్మంవైపైనా తొంగిచూడడు. మీరీ గొడవ ఇంతటిలో విడిచివేస్తే అన్ని వాటంతట అవే గ్లర్దుకుపోతాయి. దీనికి మీరేమి అనుమానపడ

# విశాల నేత్రాలు

నక్కరలేదు. స్వయంగా నేనే వెళ్లి కలిసేసుకుంటాను. సరిగదా ! నామాట నమ్మండి. ఇంతా చేస్తే కావలివాళ్లెవరికి ప్రాణాపాయం కలుగలేదు. వాళ్లందరి గాయాలు క్రమక్రమంగా నయమవుతున్నాయి! కాదంటారా ! అప్పైన మీ చిత్తం! ఇక నే నింతకంటె పట్టుబట్టడం భావ్యంకాదు. మన దండనాయకు లెటువంటి చండశాసనులో మీకు మాత్రం తెలియదు గనకనా !'

ఎంతగా ఆలోచించినా తిరుమలరెడ్డి కేమనడానికి పాలుపోలేదు. మరి కొంతసేపు మౌనం వహించి లోలోపలి కోపావేశం నిగ్రహించుకుని ఉసూరుమని నిట్టూర్చి ఎట్టకేలకు అంగీకరించినట్టు నటించాడు.

'మీ రిన్నివిధాల మరి తొందరలేదని భరవసా యిస్తున్నప్పుడు నేను కాదు, కూడదని అంటే మాత్రం లాభమేమిటి ? సరే, మీ యిష్టం వచ్చినట్టే కానివ్వండి ! అయితే రంగనాయకుడిక శృంగారమంజరి భవంతి చుట్టుపక్కల ఎక్కడయినా అడుగుపెడితే మాత్రం వ్యవహారం చాలా దూరందాకా వెళ్లిపోతుంది. మీ మాటమీద కట్టుబడి నే నింతటితో ఈ వ్యవహారానికి తిలోదకాలిస్తున్నాను. సెలవా ! మరి !'

తిరుమలరెడ్డి తటాలున లేచి నిలుచున్నాడు. తలవరి అతని ధోరణి కనిపెట్టి 'ఎంతమాట!' నా కామాత్రం తెలియదా ?' అని సింహద్వారం దాకా సాగిపోయి సగౌరవంగా వీడ్కొన్నాడు. తిరుమలరెడ్డి తిన్నగా తన భవంతికి తిరిగివచ్చి నప్పటినించి బాగా దీర్ఘాలోచనలో పడ్డాడు. తన మాటమీద రంగనాయకునికి తప్పక కారాగార శిక్ష పడి తీరగలదని అత డనుకొన్నాడు. తనయెడల తలవరి కంతటి గొప్ప గౌరవం కలదని అతని గట్టి నమ్మిక. దానిలో కొంత నిజం లేకపోలేదు. కాని చిట్టచివరికి వ్యవహారం అంతా తారుమారయింది. ఇక ఏమి చేయాలి ? తలవరి మాటమీద నిలబడి కొంతకాలం నిమ్మకి నీరెత్తినట్టు మాట్లాడక కూరుకుంటే ? తండ్రికి భయపడి రంగనాయకుడిక హేమసుందరితో తెగతెంపులు చేసుకుని ఏమీ ఎరగనట్టు మాట్లాడక కూరుకుంటాడా ?

రెడ్డికా విషయమై ఏమాత్రము నమ్మకం కలగలేదు. వా రిద్దరి మధ్య ఏర్పడిన అనుబంధం క్రమక్రమంగా దృఢపడింది. హేమసుందరి వంటి చక్కనిచుక్క వలపు చూరగొన్న భాగ్యశాలి ఏదిఏమయినా సరే, మరి వెనుకంజ వెయ్యడు. వల్లమాలిన వెర్రి వలపుతో తానే తలమునకలై పోతున్నప్పుడిక ఆతనిమాట వేరే చెప్పాలా ? పైడిబొమ్మ వంటి హేమసుందరి సోయగం తలుచుకోగానే రెడ్డి శరీరం జలదరించింది! ఉల్లాసావేశంతో ఒకింత పారవశ్యం కలిగింది. గట్టిగా తల పంకించి తొందర తొందరగా మధ్యాహ్న భోజనం ముగించుకుని మేడమీదికి పోయి శయ్యమీద మేనువాల్చి తాంబూలసేవ ప్రారంభించాడు.

అప్పటికి మధ్యాహ్నం రెండు జాముల పొద్దు తిరిగింది. ఎండ వేడిమి భరించలేక మేడ పై

అంతస్సుపిద గూళ్లలో తలదాచుకున్న పావురాల రెక్కల రెపరెపలతో మేళవించిన సన్నని కలవరం మంద్ర మంద్రంగా వినిపించింది. తోటలో దిగుడు బావిలో తల్లి తాబేలు పిల్లలతో కలిసి అల్లనల్లన పైకివచ్చి అటు ఇటు పొరాడింది. పనసచెట్టు చిటారు కొమ్మ నంటిపెట్టుకుని వేలాడుతున్న తేనెపట్టు అప్పుడప్పుడే తిరిగిన పైర గాలితో రవంత అల్లల్లాడింది. ఆ కదలికలలో చెలరేగిన తేనెటీగల సవ్వడి సన్నని తంబురా శ్రుతిలా ప్రతిధ్వనించింది.

ఏదోవిధంగా రంగనాయకుని పని పట్టించి తీరాలని గట్టిగా ఆలోచిస్తున్న రెడ్డి తన ఎదట ఉంచిన పైడి పళ్లెరంలో తాంబూలపు చిలక అయిపోయాయన్న విషయమే గమనించలేదు. దానితో అతని ఆలోచనా ప్రవాహాని కకస్మాత్తుగా ఒక అడ్డంకి ఏర్పడింది. కొంచెం విసుగుదలతో లేచి విలబడి దాసి ముత్యాలు కోసం ప్రాకారంలో నాలుగు వైపుల పరిశీలించాడు. కొంచెం గొంతెత్తి పిలిచాడు. ముత్యాలదివిని దట్టంగా తాంబూలపు చిలక లమర్చిన పళ్లెంతో అక్కడికి వచ్చి నెమ్మదిగా అది ఒక పక్కన ఉంచి ఇంకొక ఆజ్ఞ కోసం నిరీక్షిస్తూ నిలబడింది.

రెడ్డి ఒక చిలక అందుకొని నోట బెట్టుకొని 'ముత్యాలూ ! అమ్మగా రేం చేస్తున్నారే ?' అని అతి రహస్యంగా అడిగాడు. తాంబూల చర్వణంతో ఎరుపెక్కిన పెదవిపై చిన్న చిరునవ్వు చిందించాడు.

'ఇంకా లేవలేదు బాబూ ! అవ లీవేళ పొద్దుటి నించి కొంచెం తలనెప్పిగా ఉందన్నారు.'

రెడ్డి తవ చిటికినవేలి రత్నాంగుళీయకం తీసి పైకెత్తి పట్టుకుని 'ఈవేళ నువ్వోక చిన్న పని చేసిపెట్టాలి' అన్నాడు. 'ఏమిటది ?' అన్నట్టు విస్తుపోయి చూసింది దాసి.

'ఇది అతి రహస్యంగా తీసుకువెళ్లి హేమసుందరి కిచ్చిరావాలి. ఎందుకని అడిగితే నేను పంపించానని చెప్పు. మాణిక్యవల్లికిగాని శృంగారమంజరికి గాని తెలియకూడదుసుమా ! తెలిస్తే కొంప లంటుకున్నాయన్నమాటే ! ఎల్లాగో అలాగ ఈ పని సాధించుకు రావాలి' రెడ్డి సన్నగా కన్నుగీటి హెచ్చరించాడు.

ముత్యాలు కొంచెం భయపడి రెడ్డి భార్యగాని మేలుకొన్నదేమో అని అటు యిటు పరకాయించింది. కొంత ధైర్యం తెచ్చుకొని దోసిలికట్టి 'అమ్మగారికి గాని తెలిస్తే నా కాబోరు దక్కదు బాబూ ? మీకేం మారాజులు !' అని తల వంచుకొన్నది.

రెడ్డి ఇంకొక చిలక నోట బెట్టుకుని లీలగా నవ్వి భయంలేదులే ! నే నున్నానుగా ! అని గట్టిగా భరవసా ఇచ్చాడు. అయినా ముత్యాలు మాట్లాడలేదు. అలాగే తలవంచుకుని నిలుచున్నది

'నువ్వనుకున్న దానికన్న బాగా ఎక్కువగానే ముట్ట జెబుతానులే ! ఎన్నడు లేనిది ఎందుకే నీకింత బెదురు !'—

'ఉన్నమాట చెబితే కోపగించుకోరుకద !'

'ఏమిటి కథ ! భయం లేదులే ! చెప్పు !'

'ఆ అమ్మ చూపు వేరే ఇంకొకరిమీదికి తిరిగిందని విన్నాను.'

# విశాలనేత్రాలు

ఆ సమాధానం విని వినగానే రెడ్డి లోలోపల భగ్గుమని ప్రజ్వరించాడు. అయినా నిగ్రహించుకొన్నాడు.

'ఎవడే వాడు ?'

'వెంకటనాయనింగారి చిన్న కొడుకు బాబూ !'

'అలాగా ! ఈ మాట నీ కెలా తెలిసింది ?'

'ఎవరో అంటే విన్నాను నా కంతగా గుర్తు లేదు.'

రెడ్డికా ప్రత్యుత్తరం బొత్తిగా రుచించలేదు.

'ఈ నీలాపనిందల కేంలే ! లోకులు కాకులు ! ఇదిగో తోక అంటే అదిగో పులి అంటారు. సరే, దీనికేంగాని నువ్వు గట్టిగా తలుచుకుంటే సాధించలేని వ్యవహారాలున్నాయా ముత్యాలూ ?'

ఆ పొగడ్తతో ఉప్పొంగిన ఆ దాసి 'సరే వెళ్లి ఒకసారి మాట్లాడి వస్తాను. ఇంతకి ఆ అమ్మ ఏమంటుందో మరి' అని నసిగింది. రెడ్డి ఆమె ధోరణి కనిపెట్టి 'వట్టి చేతులతో తిరిగి రాగూడదుసుమా !' అని తిరిగి గట్టిగా హెచ్చరించాడు. మరికొంతసేపాలోచించి 'అన్నట్టు సింహాచలం గాని వస్తే ఇక్కడి కొకసారి పంపిస్తావా ?' అన్నాడు. 'అలాగే' అని ముత్యా లక్కడినించి వెళ్లిపోయింది. మరికొంతసేపటికి సింహాచలం రెడ్డి ఎదటికి వచ్చి చేతులు కట్టుకొని నిలుచున్నాడు. కాని తల వంచుకొని దీర్ఘాలోచనలో పడిన రెడ్డి వాడి రాకే గమనించలేదు. సింహాచలం రెడ్డి భవంతి తోటమాలి. ఉక్కుముక్కలాంటి మనిషి. వాడికి రెడ్డి ఎంత చెబితే అంత. నిలుచున్నపాటుగా నిప్పులో దూకమన్నా మరి వెనుకంజ వెయ్యడు. చాలాకాలంనించి రెడ్డి దగ్గర తోటమాలిగా కుదురుకొన్నాడు. మరికొంతసేపలాగ నిలబడినతరువాత 'ఏంతో వినయంగా ఎందుకో పిలిపించారు బాబూ ! ఏమిటి సెలవు !' అన్నాడు.

రెడ్డి తలపైకెత్తి 'సింహాచలం ! నువ్విప్పుడొక వ్యవహారం చక్కబెట్టుకురావాలి. గట్టిగా నడుం బిగిస్తేనేగాని మన గౌరవం దక్కేటట్టు కనబడడంలేదు. ఎలాగ సాధించుకు వస్తావో మరి !' అని ప్రోత్సాహసూచకంగా చిన్న చిరునవ్వు చిలకరించాడు.

అత డింతకుముందెన్నడు ఇంతటి మన్నన చవిచూచి యుండలేదు. రెడ్డి మాటలతో ఉబ్బితబ్బిబ్బయినాడు.

'అదేమిటి బాబూ ! మీ రలాగ సెలవియ్యాలా ? ఇన్నాళ్లనించి మీ విస్తరిదగ్గర మెతుకు లేరుకుని తిని బతికినవాళ్లం కామా ! ఇంతకి అంతటి ఇబ్బంది ఏమి వచ్చింది ?

ఆ సమాధానంతో రెడ్డి గాఢా ధైర్యం తెచ్చుకొని నెమ్మదిగా తన పన్నాగం బయటపెట్టాడు.

'సింహాచలం ! మన గ్రామంలో రంగనాయకుడని కట్టు పొగరుబోతు ఒక డున్నాడులే ! వాడి పేరుగాని నువ్వెప్పుడయినా విన్నావా ?

'వెంకటనాయనింగారి కొడుకుమాటేనా' మీ రనేది ?'

'అవును ! వాడి సంగతే మాట్లాడుతున్నాను. అతగాడు పొద్దస్తమానము మన శృంగారమంజరి మేడచుట్టూ తిరుగుతూ నానాగొడవ చేస్తున్నాడు!'

'వాడికిదేం పొయ్యేకాలం బాబూ !'

'హెయ్యేకాలమే వచ్చిందిలే !' లేకపోతే ఇలాంటి చెడుదారిలో పడతాడా ? వాడి మూలాన పాపం శృంగారమంజరి బాగా బెంగపెట్టుకుని చిక్కి శల్యమయింది. ఈమధ్యన మేడలో జొరబడి కావలి వాళ్ళందరిని చావగొట్టి గోడదూకి పారిపోయాడట! పాపం శృంగారమంజరి నెత్తి నోరు బాదుకుని వాతో మొరపెట్టుకుంది !'

'అయ్యో ! పాపం ! వేలెడులేడు ! వా డప్పుడే ఇంతటి తుంటరి పనుల్లోకి దిగాడా ?'

'ఇంకా మెల్లిగా అంటున్నావా ? పాపం వాళ్ళ పిడిబాధ పడలేక వూరు ఒదిలిపెట్టి ఎక్కడి కయినా వెళ్ళి తలదాచుకోవాలని అనుకుంటున్నారు.'

'అలాగా ! బాబూ ! అయితే మరి ఏమిటి పెలవు !'

'మరేమీ లేదు. నువ్వు కొంచెం గట్టిగా కలగ జేసుకుని వాడి తలపొగరంతా అడిగించివెయ్యాలి !'

దానితో సింహాచలం గుండెల్లో రాయి పడింది. కొంచెం తటపటాయించాడు :

'తమరన్నమాట తిన్నగా బోధపడలేదు బాబూ!'

'ఇందులో బోధపడడాని కేముంది ? కాలో చెయ్యో విరిచి ఒకమూల కూచోబెడితేనే గాని వాడి పీడ విరగడయ్యేటట్టు కనబడడంలేదు. ఇది నీకేగాని మరి ఎవరికి సాధ్యమయ్యేపని గాదు.'

'బాబూ ! అతగాడు సాము గరిడీలలో బాగా ఆరితేరిన మనిషి. ఆపైన బాగా ఒలగం ఉన్నవాడు! ఇది నలుగురి నోళ్ళలోను పడితే పెద్ద గొడవవుతుం దేమో !'

రెడ్డికి చిరాకు తలకెక్కింది.

'నిమ్మకి నీరెత్తినట్టు చేస్తే నలుగురిలోను ఎందుకు పడుతుంది ? నీకేమన్నా మతిగాని పోయిందా ?'

సింహాచలం మళ్ళీ నీళ్ళు నమిలాడు.

'ఏమో బాబూ ! నా కెందుకో భయంగా ఉంది ? ఈ సారికి మాత్రం ఇంకెవరినయినా పంపించండి!'

ఆ ప్రతి సమాధానంతో రెడ్డి కొంచెం మండి పడ్డాడు.

'ఇంకెవరి నయినా పంపించేమాటయితే నోరు విడిచి నిన్నడుగుతానా ? ఉద్దండపిండంలా ఉన్నావే! ఎందుకురా నీకింత భయం !'

'భయంకాదు బాబూ ! పిల్లలుగలవాణ్ణి. అనవ సరంగా గొడవల్లో పడిపోతానేమోనని ....'

'ఓరి పిరికిపందా ! నువ్వింత అప్రాచ్యుడ వనుకో లేదురా ! ఛీ ! ఛీ ! మరి నా ఎదుట నిలబడకు!'

అయినా సింహాచలం చేతులు నులుముకుంటూ అక్కడే నిలబడి కొంచెం తల వంచుకున్నాడు.

అంతలోనే రెడ్డి మళ్ళీ గొంతెత్తి గర్జించాడు

'ఏం ఎందు కలాగ నిట్రాయిలా నిలబడ్డావు! చేతనయితే చెయ్యి ! లేదన్నావా మరి నాకు నీ ముఖం చూపించకు ! ఛా ! ఏం వినబడడంలేదూ? కదలవేం?

రెడ్డి పెడముఖం పెట్టుకుని కూర్చున్నాడు. మరి గత్యంతరంలేక సింహాచలం గిరుక్కున వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు. — ఇంకా ఉంది.

# హరివంశం

**7 వ పేజీ తరువాయి**

ఆ వృత్తాంతమును చెప్పుచున్నప్పుడు, వాడు ఈమాటలు చెప్పగా తనకును నవ్వువచ్చెను. వాడు అట్లుచెప్పెను. తనమనస్సింత కష్టపడలేదు. అయిష్టమైనదానిని కొందరు ఇష్టముకల్గినట్లు చెప్పగలరు. తనకు అది చేతకాలేదు. తనకుతానే అట్లు చెప్పలేకపోయెను.

"వాచాలా!"

"ఏమి మహారాణి!"

"నీవు చెప్పవద్దు. నేను చెప్పెదను. నేను దత్తిలునివలన నంత వృత్తాంతమును విన్నాను. రాత్రి ప్రొద్దుపోయినది. మహారాజు నిద్రపోవల యునా వలదా! మరియు తెల్లవారి ఆయన ధర్మాసన ముండవలయునుగూడ. నీవు కథను ఇక తెమల్పలేవు. నేను తెమలిచిపెట్టెదను. ఏమి మహారాజా! ఏమందురు....."

"అట్టులే కానిమ్ము"

"ఇచ్చుట కానిచ్చుట కేమియులేదు. మాతలి తన రథముతో దారుకు ననుసరించెను. దారుకు డొక సమతలమున ఆగెను. ఆగి వానికా విద్య చూపించి వెడలి పోయెను ....."

"వెడలిపోయెనని ఎప్పుడో తెలిసినది. ఎట్లు వెడలిపోయెనో ఇంకను పూర్తిగా తెలియలేదు."

"అదియును చెప్పెదను."

"సరియే ! చెప్పుము."

"దారుకునకు మాతలిపై అనుగ్రహము కలిగి నది. వాని కాయన ఆ విద్యను చూపి వెడలి పోయెను."

"దారుకునకు మాతలిపైనను, యాదవునకు నీపైనను అనుగ్రహము కలిగినవి. ఆయన వెడలెను. ఈయన ఇక వెడలవలయును ...."

సుదక్షిణ పౌండ్రకుని చురుక్కున చూచినది. "స్వామి ! మీకు మాటాడుట తెలియును. నిజముగా ప్రభువునకు నాపై అనుగ్రహమే కల్గినచో మీరిట్లు లుండెడివారే కాదు ....."

"రూపమాసియుండునని నీ భావము ...."

ద్వారమువద్ద కంచుకి కదలెను. చేతిలోని వెండి బెత్తముతో నేలను పొడిచి ధ్వని చేసెను. "తల్లీ ! నేను చెప్పనే చెప్పితిని. మహారాజు మనస్సు స్వస్థముగ లేదు. ఆయన ఏమియైన మాటాడును, తమరు యిచ్చుటకు వద్దని ...."

పౌండ్రకు డాతనిని చూచిన చూపులో అవహేళనము, వికటహాసము, గౌరవము మిళితములై ఉన్నవి. అతడు అనిన మాటలలో లవహేళనము మాత్రము మిగిలినది.

"నీవు వృద్ధుడవు"

కంచుకి నవ్వెను. నవ్వి ఇట్టు లనెను.

"నేను పాతకాపును"

"తెలియుచునే యున్నది"

అని పౌండ్రకుడు సుదక్షిణతో ఇట్లు లనెను : "సుదక్షిణా ! మధ్యలో నాగితివి !"

"ఆగలేదు ! స్వామి ! తమ మాటలు విను చున్నాను" అన్నది సుదక్షిణ. అని తిరిగి ఉన్న రనుకొన్నది. అనుకొని ఇట్లు చెప్పినది.

"దారుకు డప్పుడు తన రథమును విచిత్రముగా నడిపించెను. అంతలో అంత వేగమును ఆ రథమెట్లు పుంజుకొనినది. కనుమూసి తెరచులోపల రథ మంతదూరము పోయినది. ఆ గుర్రములు విచిత్రముగా కదిలినవి. ఆ రథము చక్రభ్రమణముగా నడచినది. మాతలి రథమును చుట్టుచు నడిచి, వేగమును మరియు పుంజుకొన్నది. అప్పుడు దారుకుడు మాతలితో అన్నాడట. 'ఓరి ! మాతలి ! ఇప్పుడు చూడుమురా ! నీకు ఒక విద్యను చూపెదను. దానిని చూచి పోదువుగాని, నీ రథమును గూడ నాతో రానిమ్ము" అని. అట్టులని ఆయన

ఇన్ష్యూరెన్సు ఏజంటు తన భార్యకు కారునడపటం నేర్పుతున్నాడు. కారు మిట్టప్రదేశం నుంచి పల్లానికి దిగుతున్నప్పుడు హఠాత్తుగా బ్రేకులు చెడిపోయాయి.

"బాబోయ్! బ్రేకులు పడటం లేదు. ఇప్పుడేం చెయ్యమంటారు?" చెవులు పగిలిపోయేటు ఆమె కేక పెట్టింది.

"మరేం పరవాలేదు! ఏదిచవకైన దనిపిస్తే దానికి ఢీకొట్టించు" అతడు నిర్లిప్తంగా సమాధానం చెప్పాడు.

జి. నాగేంద్రరావు (బాపట్ల)

తన చేతిలోని కళను విచిత్రముగా గాలిలో కదలించెను. మాతలి రథమునకు కట్టి యున్న గుర్రములను కదిలినవి. దారుకుని రథమునంటి పోయినవి. ఒకచో దారుకుడు తన రథమును విచిత్రముగా నడిపించెను రథము మొగలో నుండి నొక చక్రము వరకు తన శరీరమును వ్యాపింపజేసి, ఆ రథము చక్రము కంటియుండునట్లు చేయు సీల నూడదీసెను. తరువాత నా చక్రముకన్న వేగముగా రథమును నడిపించెను. చక్రము ముందు, దాని వెనుక మాతలి రథము. దారుకుని రథము పవన వేగములో ముందునకు పోయినది. ఎక్కడో ఒక్క చక్రమణము తిరిగినది. మాతలికి అదియే ఆశ్చర్యమైనదట. ఒక్క చక్రముపై రథము ఒరిగి పడకుండ నడచుట : ఆ నడచుటలో గూడా నంత వేగము. రెండు చక్రములును ఉన్నట్టులే రథము నడుచుచున్నది. అది అద్భుతముకాక మరేమి ! విడివ చక్రము నంటి వాని రథము పోవుచున్నదిగదా ! అంతలో అంతదూరమున దారుకుని రథము చక్రభ్రమణము చేసినదిగదా ! ఆ రథము మాతలికి అంతలో ఎదురుగా, ప్రక్కవాటుగా వచ్చినది. అప్పుడు దారుకుడు వానితో అన్నాడుట : "ఓరి ! ఇది రథవేగమును నిల్పుటవలన సాధ్యమగునని. గుర్రములను గూడా ఒడుపుగా నడుపవలయును" అనుచు దారుకుడు రథమును ముందునకు పోనిచ్చెను. మాతలి వెనుదిరిగి చూడగా, అతని రథము అప్పుడే మరియొక చక్రభ్రమణము చేయుటయు, మాతలి రథము నంటి ప్రక్కగా వచ్చుటయు జరిగి పోయినవి. ఇప్పుడు దారుకుని రథమెట్టు లున్నదనగా, నాత డేవైపు చక్రము నూడదీసెనో, ఆవైపు ఆ చక్రమున కభిముఖమై యున్నది. అట్టులా రథము అమిత వేగముతో మాతలి రథమును గడచినది. ముందు పోవుచున్న చక్రమును సమీపించినది. దారుకు డంతలో తన రథముపై చక్రముండు తావు వరకు శరీరమును వాల్చి వ్యాకోచము చెందించెను. ఎట్లు ఈ చక్రమును యథాస్థానము చేర్చెనో, ఎప్పుడు మరల సీలను బిగించెనో, మాతలి ఎరుగలేకపోయెను. అతడు తిరిగి ఆ రథమును చూచువేళ కది చక్రసహితమై వేగము తగ్గి నడుచుచుండెను. మాతలి రథము తనరథ సమీపమునకు వచ్చు వరకు, దారుకుని రథ మట్లు నడచెను. ఆ రథము సమీపమునకు రాగా దారుకుడు మాతలితో అన్నాడట. "మాతలి ! దారుకుని విద్య ఇట్టిదని, వాడు స్వామి సారథియని మీ స్వామికి చెప్పుమురా ! అని ....."

అని సుదక్షిణ కొంత తాళి "స్వామి ! మీరు వానిని పూర్తిగా వినకుండా వెడలనడిపితిరి !"

"అని చెప్పుటకు నీవు వచ్చితివి. అంతేనా ! లేక నీ చేసిన కార్యము సఫలమైనదని స్వయముగా చెప్పుటకు వచ్చితివా ?" అనినాడు పౌండ్రకుడు

"నేసీ కార్యమును చేయకపోయినచో ప్రభువులు అధర్మము నావరించినవారై యుండెడివారు. వామాక్షి గొంతు కోసెడివారై పోయెడివారు. తమకు ఆమె గురుపుత్రి కదా ! ఆమె నాకు ఆడబిడ్డ. ఆమెను నిమ్ముల గూడ నేను రక్షించుకొంటిని"

"ఒక్క మాలిని తప్ప" అన్నాడు పౌండ్రకుడు.

"స్వామి ! వాడు తెలిసినవాడు వానిని వాడు రక్షించుకొనగలడు ...."

"అనగా నేను తెలియనివాడననియే కదా నీ అర్థము ...."

"కావుననే ఇప్పు డిటుల వచ్చినాను. ధర్మాసన ముండినప్పుడు తమరు తమ్ము మరచిపోవలయును. ధర్మమును మాత్రమే ఆచరించవలయును. ఈమాట చెప్పుటకే వచ్చినాను" అని సుదక్షిణ కంచుకి వెంట నచ్చటనుండి తన మందిరములకు వెడలిపోయినది.

పౌండ్రకుడు గవాక్షమును దరిసి, ఆమె పోయిన మార్గమును చూచుచు నిలబడెను. వంద కరదీపికల వెలుగులో ఆమె గంగయొక్క ఒక్క మడుగులోని శతపత్రమువలె ప్రకాశించెను. ★



# కొత్తనుడికట్టు-4

## అ డ్డం

1. పద ! పిలక కొంచెం విరగేస్తే తర్వాత.
3. వారింజపండులో ఒకభాగము తిరగబడింది.
6. స్త్రీ.
8. ఇది ఎవరిదైతే వారికశ్రతువు, అని నీతిశతకం.
9. ఏడుపు పొడిగిస్తే రుచి బావుండగా?
11. దూర్వ.
13. ఆ! పద, ఇందులో భయపడటాని కేముంది ?
14. నల్లచారలదుప్పి
16. ముక్కు.
19. ఎగిరిఎగిరి.
20. గుర్రం తలకాయ!
21. ఖండము.
22. ఢిల్లీ దగ్గర నది.

## ని లు వు

2. మోసగాడు.
4. —వానలు.
5. ఆనకలు ముందే తర్వాతా?
7. దారి.
10. కరవీరము
11. శంఖ, చక్రముల తగాదా?
12. తోడుగా.
13. ఆడవిద్దు!
15. రక్తము.
16. 'స్టేజి'మీదది.
17. ఖడ్గము.
18. ద్వారము

★

## 3 వ-కొత్త నుడికట్టుకు జవాబు.

★

### అ డ్డం :

1. జేగురు, 3. తేకి, 7. పత్రిక, 9. సురమా, 11. గాలము, 13. లులి, 14. మెకం, 15. ఆడుది, 17 చమురు; 19. టిప్పణి, 20. రథు, 21. అత్యంతము.

### ని లు వు :

2. గునపము, 4. దినుసు, 5. హంగామా, 6. దగా, 8. కలువ కంటి, 10. రథికుడు, 12. లక్షణము, 15. ఆణిముత్యము, 16. దివి 17. చలువ. 18. రబ్బరు.





# పొట్టికథలు

## హితోపదేశం

ఇటలీ నియంత ముస్సోలోని ఒకసారి కారులో ఎక్కడికో వెడుతున్నాడు. దారిలో కారు చెడిపోయింది. తానెవరో తెలిస్తే జనం గుమిగూడుతారని ముస్సోలోని గుట్టుచప్పుడి కాకుండా దగ్గరలో ఉన్న సినిమాహాలుకు వెళ్లి మారుమూల సీట్లో కూర్చున్నాడు. జనమంతా గుడ్లప్పగించి న్యూస్‌రీల్ చూస్తున్నారు. తెరమీద ముస్సోలోని కనిపించే సరికి అంతా ఒక్కసారిగా లేచి నుంచున్నారు. అతడు మాత్రం లేవలేదు.

సినిమాహాలు యజమాని సరాసరి అతడి దగ్గరకు వచ్చి భుజం మీద చెయ్యి వేశాడు. "చూడండి. నాకూ మీకు మల్లేనే అనిపిస్తుంది. కాని ఎందుకైనా మంచిది లేచి నుంచోండి. మీ క్షేమంకోరి చెబుతున్నాను." అని హితోపదేశం చేసి చకచకా వెళ్ళిపోయాడు.

రత్నమాల (చీరాల)

* * *

## పెద్దమనిషి జవాబు

"ఇంతకూ భీమా చేయించుకొనడానికి మీ అభ్యంతరమేమిటో చెప్పారుకాదు" చెప్పి చెప్పి విసిగెత్తిపోయిన ఏజంటు నీరసంగా ఆ పెద్దమనిషిని అడిగాడు.

"అభ్యంతరమేమిటో చెప్పమంటారా? అయితే వినండి— బతకడంకంటే చావటమే మేలన్న భావం ఎందుకనో నాకంతగా రుచించటంలేదు" పెద్దమనిషి నిష్కర్షగా చెప్పేశాడు.

రాజేశ్వరి (రాజమండ్రి)

* * *

## రోగి బెంగ

"ఆ రోజు ఉదయం డిస్పెన్సరీలో జనం కిటకిటలాడుతున్నారు. ఓ పెద్దమనిషి ఒక మూల కూర్చొని తనవంతు ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్నాడు. ఒక్కరొక్కరే జనమంతా వెళ్లిపోయారు. చివరకు డాక్టరుగారు ఆ పెద్దమనిషిని పిలిచి "మీకు చాలా ఆలస్యం అయిపోయింది. మన్నించాలి" అని క్షమాపణ చెప్పకున్నారు.

"ఆలస్యమైనందుకు నాకే బెంగలేదు గానండి, నా రోగం ముదరక మునుపే చూస్తారేమో ననుకున్నాను" పెద్దమనిషి నిబ్బరంగా సమాధానం చెప్పాడు.

ప్రసాద్ (వరంగల్లు)

* * *

## కెమిస్ట్రీ మాష్టారు

కెమిస్ట్రీ మాస్టారు ద్రావణాల లక్షణాలు ప్రయోగ సహితంగా వివరిస్తున్నారు. "చూశారా పిల్లలూ! నేనిప్పుడు ఈ ద్రావకంలో రూపాయికాసు వేస్తున్నాను కరిగిపోతుందో కరిగిపోదో చెప్పండి చూద్దాం." ఆయన ఉత్సాహంగా అడిగాడు.

"కరిగిపోదండి!" రామూ రపీమని సమాధానం చెప్పాడు

"కరిగిపోదూ! సరే ఎందుకు కరిగిపోదో చెప్పు చూద్దాం."

"ఎందుకంటారా అదినిజంగా కరిగిపోతే మీరు అందులో వెయ్యరుగా"

గోవిందరాజులు (భీమవరం)



## వనితలకు మనవి

వనితావాణికి పంపే ఉత్తరాలు క్లుప్తంగా ఉండాలి. వీలైనంతవరకూ పత్రికలో సగం 'కాలం' మించకుండా ఉంటే బాగుంటుంది. వ్రాసినవారి పేరు వగైరా తెలుగులో స్పష్టంగా వ్రాయాలి. ఇంగ్లీషులో ఉండకూడదు.

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7, Thambuchetty Stree Madras-1. Chief Editor, S. Sambhu Prasad.



చుంచుకోసం పొంచికాపు

ఫొటో. టి. దామోదరరావు (పూనమల్లి)

